జనవరి 1994

# వైశ్యప్రబోధిని

తెలుగు మాసపత్రిక

శ్రీ వాసవి ఆత్మార్పణ దినోత్సవము

ఈ ఫిబ్రవరి
12వ తేది

అగ్నౌ శరీరార్పణ దివ్యగాథా।
లోకప్రసిద్ధా బహుళాహి నార్యః।
త్వయా సమానా భువినాస్తి! నాస్తి!


శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరి దేవి

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

**2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)**

సంప్రదించ వలసిన అడ్రసు :

**6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**

**హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320**

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము:

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు 2500/-లు లేక అంతకు పై బడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము

**నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి** — అధ్యక్షులు

**మేడా నరసింహులు శ్రేష్ఠి** — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు

# MR
## బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్







" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పైచేయి "

1, 5, 15 కే.జి.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి - అతి
స్వచ్ఛమైనవి.

**MADHU REFINARY PRIVATE LIMITED**
**GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.**
✆ :31, 64, 74.

✆ : Offi : 231, 264, 398, 399. Resi : 274.

**MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,**
**Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.**

**Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.**

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం
✆ : 62
ప్రకాశం జిల్లా.

బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం
✆ : 3158 (S.T.D. 085195)
కర్నూలు జిల్లా.

**అక్షయ మహారాజ పోషకులు :** ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకిలలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫొటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రూ.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆరోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫొటో సత్రావరణములో పెట్టబడును.

రూ.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

భోజనశాల, ప్రార్థనా మందిరము, కళ్యాణ మంటపము, గోశాల, సమావేశ భవనముతో కూడా 109 వసతి గదులు గల ఈ సత్రము ఆదర్శవంతంగా నిర్వహించబడుచూ, నిత్యాన్న దానము చేస్తున్నదని తెలియజేయుటకు సంతోసిస్తున్నాము.

రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రాలకు ప్రతి ఏటా ఒకటి లేక రెండింటికి రూ.50,000/-ల నుండి రూ.1,00,000/-ల వరకు ఆర్థిక సహాయము అందించాలన్న తీర్మానము సర్వసభ్య సమావేశముచే ఆమోదించబడినందున ఈ సత్రమునకు ఆర్థిక సహాయం చేసిన దాతలు పరోక్షముగా రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రములకు కూడా దానము చేసినవారు ఔతారు.

పై మూడు పద్ధతులలో ఏదో ఒక పద్ధతిన ఈ అన్న సత్రమునకు ఆర్థిక సహాయాన్ని అందించి దైవ కృపకు పాత్రులు కమ్మని సోదరులకు విజ్ఞప్తి చేస్తున్నాము.

అన్నా సుబ్బ రంగయ్య
కార్యదర్శి

పోలిశెట్టి సత్యనారాయణ
అధ్యక్షులు

వైశ్య ప్రబోధిని
( మాసపత్రిక )
స్థాపితము
1969

సంపుటి
25

సంచిక
5

జనవరి-1994

సంపాదకులు :
'సంఘోద్ధారక',
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతంశ్రేష్ఠి

ప్రాప్తిస్థానం
ఫోన్ : 3025
వైశ్య ప్రబోధిని
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలని,
విద్యామందిర్
తూ॥ భాగం
కడప - 516 002.

సంపాదకీయం

# ఆత్మార్పణ దినోత్సవ ఆవశ్యకత

పరాశక్తికి గల పదునాల్గు నామాలలో 'కన్యక' ఒకటి. ఆ కన్యక అను నామానికి పరమేశ్వరి అను పదాన్ని జోడించి శ్రీ కన్యకా పరమేశ్వరీదేవిగా మన పూర్వులు అనాదినుండీ ఆరాధిస్తున్నారు. ఆ కన్యకా పరమేశ్వరీ దేవియే, అంధకార బంధురమైన ప్రపంచములో అహింసా జ్యోతిని వెలిగించుటకై 'శ్రీ వాసవి' అను నామముతో కుసుమార్య, కుసుమ గుప్తులకు తెలుగింటి ఆడపడచుగా, పవిత్ర గోదావరీ తీరములో జన్మించి, తన ఆత్మార్పణ ద్వారా వర్ణాశ్రమాచార ధర్మ సంరక్షణ చేసింది. 'అహింసా పరమో ధర్మః' అను వేదోక్తిని కార్య రూపములో చూపించి, ప్రపంచంలో ప్రథమ సత్యాగ్రహి అయింది. 'రక్తరహిత శాంతి సత్యాగ్రహము' అను సరిక్రొత్త విధానాన్ని ఈ ప్రపంచాని కందించి, తన అవతార ధ్యేయమును నిరూపించింది. అట్టి మహత్తర సంఘటన జరిగిన ఆ పవిత్ర దినము మాఘశుద్ధ విదియ. ఆ పుణ్యతిథి ఈ సంవత్సరము 12.2.1994 శనివారము అయింది. అందు వలన ఆయమ చేసిన ఆ త్యాగనిరతిని సర్వ ప్రపంచమూ మరియొక మారు మననం చేసుకొనునట్లుగా ఆ ఆత్మార్పణ దినోత్సవాన్ని 12.2.1994వ తేదీ శనివారం

అత్యంత భక్తి శ్రద్ధలతో జరిపించడం శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవ్యాలయాల పరిపాలకుల అవశ్య కర్తవ్యము.

అయితే, ఈ మీ వైశ్యప్రబోధిని గత 25 సంవత్సరాలుగా చేస్తున్న కృషివల్ల ఈ ఆత్మార్పణ దినోత్సవం ప్రతియేటా జరుగుచున్నది. కానీ ఇంకా అనేక వాసవీ ఆలయాలు శ్రీ వాసవీ దేవిని ఉద్దేశించి, శ్రీ వాసవీ నామావళితో జరిపించడం లేదు. అలా జరిపించగలిగినపుడే ఈ కార్యక్రమానికి పవిత్రత చేకూరుతుంది. మన మాతృశ్రీ ఆలయాల, మన ధర్మ సంస్థల స్వతంత్ర ప్రతిపత్తిని సంరక్షించుకో గలుగుతాం. శ్రీ వాసవీ దేవ్యాలయాల పరిపాలకులు ఈ విషయాన్ని గుర్తించడం అవసరము.

## వ్యక్తిగా మీ కర్తవ్యము

ఆ రోజు, అంటే 12.2.1994వ తేదీన ఉదయాన్నే ఇంటిముంగిలిని రంగవల్లులతో అలంకరించి, గృహ ముఖద్వారానికి మామిడి తోరణాలు కట్టి, శుచిస్నాతులై మాతృశ్రీ వాసవీ దేవికి షోడశోపచార పూజలు, శ్రీ వాసవీ సహస్ర నామావళి సహితంగా చేసి, యధాశక్తిగా నైవేద్యాన్ని సమర్పించడమూ, ఆనాటి సాయంత్రము శ్రీ వాసవీ అష్టోత్తర శత నామావళితో పునః పూజ చేసి ముత్తైదువు లకు పసుపు కుంకుమలు ఇవ్వడమూ.

ఈ ఆత్మార్పణ దినోత్సవ కార్యక్రమాన్ని చేయవలసిన విధానమును కడప ప్రధాన కార్యస్థానంగా గల శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ - మన రాష్ట్రములోని శ్రీ వాసవీ దేవ్యాలయాలు అన్నింటికీ ఒక సర్క్యులర్ ద్వారా వివరంగా తెలియజేసింది. శ్రీ వాసవీ దేవ్యాలయాల పరిపాలకులు ఆ విధానాన్నే అనుసరించాలి.

**పాఠకులకు మా శ్రీముఖ మకర సంక్రాంతి శుభాకాంక్షలు**

# సూక్తి ముక్తావళి

"జ్ఞాన మార్గమా? కర్మ మార్గమా? ఏది మంచిది"-అనేది మన తత్వ శాస్త్రాల్లో దీర్ఘకాలం సాగిన చర్చ.

కర్మ మార్గము పాప హేతువు అనీ, జ్ఞాన మార్గమే ముక్తి దాయకమనీ భావించడం కూడ జరిగింది. ఈ భావముతో అడవులకు వెళ్ళి, ముక్కు మూసుకొని కూర్చునే వారి సంఖ్యే ఎక్కువైంది. తద్వారా ప్రపంచములో నిష్క్రియా పరత్వం పెరిగింది. జ్ఞాన మార్గము ఎట్లో అట్లే కర్మ మార్గము కూడ మంచిదేనని, దాని ఆవశ్యకత హెచ్చుగా ఉంది అనీ చెప్పాల్సిన అవసరం కూడ ఏర్పడింది చివరకు. ఆ పరిస్థితుల్లో వ్రాయబడిందే భగవద్గీత.

ఈ 'కర్మ' అనే మాటకు ఒక్కొక్కరు ఒక్కొక్క అర్థాన్ని చెప్పారు. కర్మ అంటే వ్యక్తి ఆచరణ, సమాజశ్రేయస్సు విషయములో వ్యక్తికి గల బాధ్యత-అని అర్థం చెప్పారు బౌద్ధులు. ప్రకృతిలో లీనమై ఉన్న భౌతిక సముదాయమే 'కర్మ' అన్నారు సాంఖ్యులూ, వైశేషికులూ. 'కర్మ' అంటే వైదిక కర్మేనని అర్థం చెప్పారు పూర్వ మీమాంసకులు.

భగవద్గీత ఈ కర్మ అనుపదాన్ని పై అన్ని అర్థాలలో చెప్పింది.

అన్నాద్భవంతి భూతాని
పర్జన్యా దన్న సంభవః
యజ్ఞా ద్భవతి పర్జన్యో
యజ్ఞః కర్మ సముద్భవః

-అని అంటూంది గీత. ప్రాణులు అన్నము నుండీ; ఆ అన్నము మేఘము నుండీ; ఆ మేఘము యజ్ఞము నుండీ; ఆ యజ్ఞము కర్మ నుండీ; ఆ కర్మ బ్రహ్మ నుండీ; ఆ బ్రహ్మ నాశనములేని పరమాత్మ నుండీ ఉద్భవిస్తున్నవి-అని ఈ శ్లోకానికి అర్థము.

భోగాలమీద ఆశతోనూ, స్వర్గసుఖం మీది తృష్ణతోనూ, కొందరు యజ్ఞాలు చేస్తారు. ఇది కూడా కర్మే. అయితే ఇక్కడ ఈ కర్మ లాభాపేక్షతో కూడు కొన్నది. అందువల్ల ఈ కర్మ పనికి రాదు అంటారు తాత్వికులు.

కర్మను లోకం కొఱకు చేయాలి. వ్యష్టిప్రయోజనం గురిగా కాక సమిష్టి ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని కర్మను చేయాలి. సమానమైన భావనతో కర్మను చేయాలి. అప్పుడే ఆ కర్మ నిష్కామ కర్మ అవుతుంది. కాబట్టి కర్మను ప్రతి ఒక్కరూ చేయాలి. భగవద్గీతను తులనాత్మకంగా చదివితే ఈ కర్మకే గీత ప్రాధాన్యత ఇచ్చినట్లుగా తోస్తుంది. గీతలో పదునెన్మిది అధ్యాయాలున్నాయి. అందులో దాదాపు ఎనిమిది అధ్యాయాల్లో ఈ కర్మను గురించిన విషయమే ఉంది.

"త్యాగాన్ని చేసినా, కర్మను చేసినా ఏ ఆపేక్షాలేకుండా చేయమంటాడు" సుప్రసిద్ధ బౌద్ధమతాచార్యులు నాగార్జునుడు.

నిష్కామ కర్మ ఎందుకు చేయాలి? తాను చేసిన ఆ పని వల్ల ఏ ఫలితం

లభిస్తుందో తెలుసుకోకుండా, కర్మను చేయడం తెలివి తక్కువ కాదా? అనేది కూడ ఈ సందర్భంలో ఒక ప్రశ్నే. తాను చేసిన ఆ పని వల్ల వచ్చే ఫలితం తనకు కాకుండా ఇతరులకు ఉపయోగపడు తుందా? ఇతరులకు ఉపయోగపడడ మంటే ఇతరుల శ్రేయస్సు కొఱకు ఉపయోగ పడడమేనని చెప్పడం కదా! అనే మీమాంస కూడ ఇక్కడ కలుగు తుంది. గీతా కారుడు ఈ అభిప్రాయాన్ని అంగీకరించడు.

ఫలితం కొఱకు ఎదురు చూడడం తగదు. నీ ధర్మాన్ని నీవు చెయ్యి. ఆ ఫలితం నీకు దక్కకపోవచ్చు కూడ—అని నిష్కామ కర్మకు గీత చెప్పే నిర్వచనం. ఒక తండ్రి ఆస్తిని సంపాదిస్తాడు. ఆతని కొడుకు ఆ ఆస్తిని అనుభవిస్తాడు. ఎవరో ఒక వ్యక్తి ఒక దారిలో ఒక విత్తనం వేస్తాడు. అది మొలకెత్తి, మ్రానై తీయని ఫలాలను ఇస్తుంది. ఆ ఫలాలు అందరికీ ఉపయోగ పడతాయి. మానవుడు కర్మను ఈ భావన తోనే చేయాలి. సమాజం యావత్తూ అనుభవించేందుకై వ్యక్తి కర్మను చేయాలి. ఆ కర్మను చేయడములో ఆ వ్యక్తికి మరణం కలుగవచ్చు.

ఒక వేళ కర్మ చేసిన వ్యక్తికి ఆతను ఆశించినంతగా ఫలితం లభించకపోవచ్చు. అందువల్ల ఆ వ్యక్తికి నిరుత్సాహం కలిగే అవకాశం ఉంటుంది. అందువల్లనే మనిషి తాను చేసే కర్మను సమ భావనతో చేయాలి. 'నిష్కామ కర్మ'కు అర్థం ఇదే. 'కామ' అంటే అవాంఛనీయమైన కోరిక.

అన్ని సందర్భాలలో వ్యక్తి కర్మను చేస్తూనే ఉన్నాడు. ఆ కర్మ నిష్కామ కర్మ కావాలి.

కర్మణ్యే వాధి కారస్తే<br>
మా ఫలేషు కథా చన<br>
మా కర్మ ఫల హేతుర్భూః<br>
మాతే సంగోస్త్వ కర్మణి

—ఈ శ్లోకం భగవద్గీతకు ప్రాణప్రద మైంది. భగవద్గీత అంతటా ఈ భావం వ్యక్తమౌతూనే ఉంది. కర్మలు చేయడం నీ విధి. ఫలితాల మీద అధికారం నీకు లేదు. ఫలితాలకు కారణం మానవుడు కాదు. అట్లని నిష్క్రియా పరుడుగా కూడా కారాదు.—అని ఈ శ్లోకానికి అర్థం.

కర్మలు చేస్తూ కూడ రాగ ద్వేషాలకు లోను కాని వాడు సన్యాసి. కర్మలు చేయక పోయినా మనస్సులో రాగ ద్వేషాలు కలవాడు సన్యాసి కాజాలడు.

కర్మను లోక కల్యాణం కొఱకు చేయాలి. ప్రతి ఫలా పేక్ష లేకుండా చేయాలి. స్వార్థప్రయోజనాన్ని ఆశించి చేసే కర్మ పాప హేతువు.

మనిషి ఏ కర్మా చేయకుండా ఉండ లేడు. గాలిని పీల్చడమూ, ఆహారాన్ని తీసుకోవడం మొదలగు దేహయాత్రకు కావలసిన నియత కర్మలను చేయకుండా ఏ మనిషికీ తప్పదు. కాబట్టి కర్మలు చేయకుండా మనిషి ఉండలేడు. అయితే ఫలాన్ని కోరి కర్మను చేయడమా? ఫలాన్ని కోరకుండా కర్మను చేయడమా? అనేది ప్రశ్న.

కర్మ అంటే కేవలం వైదిక కర్మలే

కాదు. లౌకిక కర్మలు చేయడం కూడ కర్మే.

మానవుడు ప్రకృతిలో భాగం. ఆ ప్రకృతి కొన్ని అంతర్గుణాల కారణంగా పరిభ్రమిస్తూ ఉంది. పరిణామం చెందుతూ ఉంది. ఇదే కర్మ. ఇదే ఆచరణ. ఈ సూత్రాలనూ, కర్మనూ మానవుడు తప్పించుకో లేడు. తప్పించు కోవాలి అని అనుకోవడం పట్టి భ్రమ.

యజ్ఞం కర్మ వల్ల పుట్టుంది. కర్మ ప్రకృతి నుంచీ, ప్రకృతి పరమాత్మ నుంచీ పుట్టుంది. కాబట్టి ఈ చక్రపరిభ్రమణానికి కర్మ అత్యవసరం. అయితే ఆ కర్మ లోక కల్యాణం కొఱకు చేయాలి.

కర్మ అంటే ఏమిటో వివరంగా తెలుసుకున్నాం. కర్మను చేయడమన్నా, ధర్మాన్ని చేయడం అన్నా ఒక్కటే. ఆ ధర్మము స్వధర్మమనీ, పర ధర్మమనీ రెండు విధాలు. పర ధర్మానికి కన్నా స్వధర్మ నిర్వహణమే ఉత్తమం.

శ్రేయోన్ స్వధర్మో విగుణః
పర ధర్మా త్స్వనిష్ఠితః
స్వ ధర్మే నిధనం శ్రేయః
పర ధర్మో భయావహః

– అంటుంది గీత.

బాగుగా అనుష్టింపబడిన పర ధర్మము కన్నా లోపముతో కూడినదైనా స్వధర్మమే మేలు. పర ధర్మము భయానకము. స్వధర్మము అంటే తన ప్రకృతిననుసరించి ఏర్పడిన ధర్మము.

ప్రతి మానవుడు ధర్మాన్ని నిర్వహించాలి. ఆ ధర్మము అంటే ఆ కర్మ నిష్కామమైనదిగా ఉండాలి. ఈ విధంగా తన కొఱకు కాక తన సమాజ శ్రేయస్సుకు నిష్కామ కర్మను చేసిన వారు ఎందరో ఉన్నారు.

ధర్మ వ్యాధుడు–తులాధారుడు, ఈ యుగములో మహాత్మాగాంధీ, పొట్టి శ్రీరాములు మొదలగు వారు తమ కొఱకు గాక లోక కల్యాణం కొఱకు కర్మను చేసిన వారే. వీరిని మనం ఆదర్శంగా తీసుకోవాలి.)

(సంపాదకుల ఆకాశవాణి ప్రసంగాల నుండి)

## తమ్మన వెంకట రత్నం గారికి సన్మానం

పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం పుర ప్రముఖులు, ప్రముఖ న్యాయవాదులు, శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ న్యాయసలహా విభాగం సభ్యులూ అగు శ్రీ తమ్మన వెంకటరత్నం గారికి 19.12.1993వ తేదీన భీమవరంలో ఘన సన్మానం జరిగింది. భీమవరం కేంద్ర మండలి ఆర్యవైశ్య సంఘంవారు ఈ సన్మానాన్ని చేశారు. భీమవరం న్యాయ వాదుల సంఘానికి అధ్యక్షులుగా ఎన్నిక కాబడిన సందర్భాన్ని పురస్కరించుకొని వీరికి ఈ సన్మానం జరిగింది. సభలో పాల్గొన్న వారిలో చాలామంది వెంకట రత్నంగారు చేస్తున్న సేవలను గురించి, ఆయన వ్యక్తిత్వాన్ని గురించి మాట్లాడి ఆయన్ను అభినందించారు.

## మతోన్మత్తి

–శ్రీమతి శిఖాకొల్లు లక్ష్మీమోహన్

ఒక మనిషె మతోన్మత్తుడై తోడి మనిషినే
బాధిస్తూ వెంటాడి వేధిస్తూ....
రాతి యుగంలోనైనా కనరాని రాక్షసత్వంతో
కర్కశ హస్తాలతో
కుటిల మనస్కుడై ప్రవర్తించే తీరు
ఎంతైనా శోచనీయం!
కులమతాల అంతరాలలో చిక్కి,
ప్రబలిపోయిన
రాజకీయపుటెత్తులతో – చిత్తై
అంధకారబంధుడై –క్రూర మనస్కుడై
మానవత్వం మంట కలిసినవాడై
పైశాచిక ప్రవృత్తితో అతడు చేసే
దురంగతాలు
మితిమీరిపోయి, ఇటువంటి వారిని
తప్పని సరియై
మోయాల్సి వచ్చింది కదా అని 'ధరిత్రి'
కృంగి పోతున్న వేళల్లో
ఎందరి కన్న తల్లుల ఆక్రందనలు
ఘోషపెడుతున్నా
శపిస్తున్నా చలించని ఈ మతోన్మత్తులు
ఇంకా ఎందరిని? తమ కుల మతోన్మత్తికి
బలి చేస్తారో కదా అని వాపోతోంది
ఒక అజ్ఞాత మానవతా హృదయం !?!...



ముఖ్య విజ్ఞప్తి

### దోమా వెంకట స్వామి గుప్త గారి రచనలు పంపండి

మహాకవులు, అవధాని శేఖరులు కీ॥శే॥ దోమా వెంకటస్వామి గుప్త గారి అవధాన పద్యాలు కానీ, వారి ఇతర రచనలు కానీ కలవారు వెంటనే ఈ క్రింది అడ్రసుకు పంపి సహకరించ గోరుచున్నాము.

శ్రీ దోమా వెంకటస్వామి గుప్త
సాహిత్య పీఠము
వైశ్యప్రబోధినీ కార్యాలయం
జయనగర్ కాలనీ,
కడప – 516 002.

– పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి
ప్రధానకార్యదర్శి.

### కామిశెట్టి రాధాకృష్ణయ్య మృతి

కడప జిల్లా రైల్వే కోడూరు ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు శ్రీ కామిశెట్టి రాధాకృష్ణయ్య శ్రేష్ఠి గారు 4.1.1994వ తేదీన స్వర్గస్తులయ్యారు. స్థానిక ఆర్య వైశ్య సంఘము, ఆర్యవైశ్య యువజన సంఘము వారు వీరికి శ్రద్ధాంజలి ఘటించి, వీరి కుటుంబానికి తమ సంతాపాన్ని తెల్పియజేశారు.

# కైలాసము

✍ శ్రీ బొడ్డు బాపిరాజు

(బాపిరాజుగారు మహాభావకులు. సరస సరళంగా సుమధురంగా పద్యాన్ని నడిపించగల జాషువా, కరుణశ్రీల సరసన నిలువగల కవిరాజు ఈ బాపిరాజు. కవిత్వములోని మాధుర్యాన్ని రసజ్ఞులు మాత్రమే గ్రహిస్తారు. వారి కొరకే ఈ ప్రచురణ – సంపాదకులు.)

ఎల్లోరా ఒక మహాశిల్పకావ్యమన్నచో, సర్వప్రపంచదృష్టినాకర్షించిన కళాఖండము కైలాసనాథమందిరమందొక రసవత్సర్గము. శతాబ్దాలుగా ససిచెడిన శిల్పవిన్యాసముతో సహృదయ హృదయశాయియగు మధుర శ్లోకము "రావణ గర్వభంగము." తద్రమణీయ సందర్శన స్మృతిస్పందన మిది.

ప్రాలేయశైలకన్యక
బాలేందుకళావతంసు కైలాసము న
డ్డోలాందోళిత మగున
కైకైలాసము తెరగుజూచి కసటుచు బలితో,

"స్వామీ! స్వామిదయానువిద్ధ
వరగర్వాంధుండు పౌలస్త్యుడున్
సామంతంబున వెండికొండ బెకలించన్
సిద్ధమైనాడు, తా
మేమో సుంతయు జిత్తగించినటు
లేనేలేదు, క్రీగంట లీ
లామందస్మితరేఖ దక్కమరి
పల్కంబల్క రేలా ప్రభూ ?

సాలప్రాంశుపటిష్ఠవింశతిభుజస్తంభమ్ములన్
హుంకృతిన్
గైలాసంబును దాకి యొడ్డరపుచున్నన్
మిమ్ము కాదన్నయ
ట్లేలా చూచెద, రంతవేడుక యటే
మృత్యుంజయా! యూగుప్రా
ణాలం గుప్పెటలోన బట్టుకొని యున్నా
రెల్ల తత్రత్యులున్.

శిరముల్ తొమ్మిది, రెండుదక్క గరముల్
వెండాడి హైమాగ్నిలో
హరు ప్రీత్యర్థము వ్రేల్చె నే పరమభక్తా
గ్రేసరుం, డాతడే
వరగర్వోద్ధతుడై తెగించె, భళిరా వాల్లభ్య,
మీ పాంగులం
ద్వరలో దేలిచి పాదుకొల్పు డిక
మాధైర్యం బహార్యంబునున్.

తమ చిత్తం బిది యెంత మెత్తనిది!
ప్రాతః కోటిలింగార్చనా
క్రమనిష్ఠామతి యంచు వానియెడ
బుత్రప్రేమ మీ కున్న న్యా
యమె కానీ కొడుకుకై ననుం గొరవి
నిల్లంటింపగా జూచు నో
రిమి యే తండ్రికి గల్గు స్థాణువగు
గౌరీజానికిం దక్కనన్."

అని యుత్క్రోశముతోడ హైమవతి
వ్యాఖ్యానించుచున్నంత ద
ద్దనుజాధీశవిధూతశైల
చలనోత్కంపమ్మునన్ దూలె శం

భుని వక్షఃస్థలి, నయ్యయాచితసమాభుక్త
స్వయంగ్రాహ సం
జనితోత్సాహి శివుండు హత్తుకొనియెన్
శర్వాణి హస్తావృతిన్

తొణికిన మిన్నేటి నణచి కపర్దమ్ము
ప్రిదులక నెలవంక గుదురు జేసి,
కలగిన ఫణిహారములు దీర్చి, గజచేల
మున వ్రేలు కటిబంధమును బిగించి,
యెడయు బినాకమ్ము నొడిసి చేదుబుడక్క
పొగయు జిచ్చరకంటి సెగల నార్చి,
తలకిన పరిజనమ్ముల జేరి యభయమ్ము
పలికి, మోవిని నవ్వులలలు పొదివి.

అంకమున శైలసుతను నిశ్శంక నిలిపి,
యేలు కొనుచును నిండు పేరోలగమ్ము
విశ్వవిభుడంత నలవోక వెండికొండ
కొనల నొత్తె నల్లన బదాంగుష్ఠరేఖ,
అప్పాటునబడు కొండన్
దెప్పున దెమలింపగాక తెగిపెడమోమై
కుప్పనగూరగ దనుజుని
యప్పుదియుం బదికరమ్ము లడుగున
జిక్కెన్.

జలరుహ మాలికన్ మదగజమ్ము
పదమ్మున ద్రొక్కి పట్టిన
ట్టుల, దన చేతు లిర్వది కఠోర
గిరీశ్వరభారసంభృతిన్
నలుగగ జొక్కి మేదియు, కనారిలి
బోనునబడ్డ సింగము
ట్లలుగును బొబ్బరించు ననమర్త
భుజాబలకోపదగ్ధుడై.

గరువము నీరుగారి, పదికన్గవలం
బొగరెల్ల జారి, దు
ర్భరమగు బాధ యోర్చుకొనరాక
యొకే మొరవెట్టు దిగగం

తరములు నుచ్చి పోవగ
వ్యథాపరిఖిన్నత గన్నువిప్పి న
త్తరికిని గాని గుర్తునకు దట్ట డహో,
గిరిశుండు వానికిన్!

"నా తండ్రీ! ఫణిరాజమండన!
అపర్ణాదృక్స్మరఃకేళిసం
ప్రీతప్రౌఢమరాళ! బాలశశిమౌళీ! భక్త
రాజన్య స
చ్చేతోమందిర! సాంధ్యతాండవ
కళాశింజానమంజీరసు
స్ఫీత శ్రీశివమూర్తి ఆర్తుడ క్షమాభిక్షన్
ప్రసాదింపవే."

దానవజాతిసాజమగు దర్పము,
రాజ్యమదమ్ము పెంపు, వి
జ్ఞాన మడంచు బాహుబలసంపద,
యిన్నియుగూడి నన్ను స్వా
మీ! నయదూరునిన్ పలిపె నిట్లు,
నెరుంగరటే యథార్థ మీ
లోని వెలుంగులౌ ప్రభువు లో
కరుణామయ! చంద్రశేఖరా!

హాయిగ శైలసౌధశిఖరాగ్ర
పరీమళపుష్పవాటికా
చ్ఛాయలలో వినోదపరిషత్పరి
తోషలు మీకు నిట్లు వి
ఘ్నాయత వృత్తినై కినుక నాటిన
నన్నెట్లు సైచు తల్లి కా
త్యాయని, కాలకంఠ! కరుణానిధి!
నమ్మితి నిన్నె శంకరా!"

శివపదాబ్జాతములు మనస్సున నిలిపి
యఖిల యోగీంద్ర దుర్లభమైన నిష్ఠ
నెనసె రావణు డంత, నింకెంతలోన
గరగు గైలాసమును దదీశ్వరుడు గూడ.

---

వైశ్యప్రబోధిని, జనవరి, 1994

# నేను, నాదేశం

( గత సంచిక తరువాయి )

ఇలా 5 సంవత్సరములు గడిచాయి. వైశ్యకులంలో వితంతూద్వాహాలు సర్వ సామాన్యమైనాయి. అప్పుడు గుంటూరు వైశ్యులే ఒక వితంతు వివాహాన్ని ఏర్పాటు చేసి నన్ను ఆహ్వానించారు. అప్పుడు నేను మద్రాసులో వుంటున్నాను. వివాహంలో నాకు పూలదండ వేసి గౌరవించారు. మొదటి వివాహసందర్భంలో రాళ్ళు, మట్టి విసరికొట్టిన సంగతి జ్ఞాపకం చేశాను. అప్పుడొకరు పూలు తెచ్చి నామీద చల్లి "ఆ చేతులతోనే ఇప్పుడు పూలు చల్లుతున్నా" మన్నారు. అందరం ఆనందించాము. గుంటూరు వైశ్యులతో కూడి పంక్తి భోజనం జరిగింది.

అయినప్పటికీ శ్రీ మద్ది వెంకట సుబ్బయ్య గారు కాలవాహిని కెదురు యీదాలనే ప్రయత్నం మానలేదు. చీరాలలో నా మిత్రులు శిఖాకొల్లు పట్టాభి గారి యింటికి వెళ్ళాను. మద్దివారి మనుమరాలు ఆ ఇంటి కోడలు. శ్రీ వెంకటసుబ్బయ్యగారు క్కూడా వున్నారు. నాతో కలసి భోంచెయ్యరు. ఏం చెయ్యాలనే సమస్య ఇంటి వారికి. వెంకట సుబ్బయ్యగారు భోంచేసిన తరువాత నేను భోంచేస్తాను అని చెప్పాను. అందుకు వారంగీకరించలేదు. వెంకటసుబ్బయ్య గారికే ఆఖరున భోజనం పెట్టారు.

## ఏలూరులో వైశ్య వితంతు వివాహం

తలవని తలంపుగా మిత్రులు శ్రీ మోతే నారాయణరావు గారు, నేను రైల్లో ఏలూరుకు కలిసి ప్రయాణం చేశాము. గుంటూరులో జరిగిన వితంతూద్వాహాన్ని గురించి ప్రస్తావించారు. ఎందుకు రాలే దన్నాను. ఏదో పనివుండి రాలేదన్నారు; ఏలూరు స్టేషనులో దిగినప్పుడు తమ యింటికి రమ్మని ఆహ్వానించారు. నేను రానన్నాను; "ఆరణాలిస్తే హొటల్లో భోజనం పెడతారు లెం"డన్నాను.

"గుంటూరులో జరిగిన వివాహానికి రానందున నీకు కోపంగావుంది. నిజానికి ఉండవలసిందే; అన్ని కష్టాలు వచ్చి నప్పుడు, నేను మీతో సహకరించకపోవడం మంచిపనికాదు. ముందు జరగబోయే వితంతు వివాహాన్ని ఏలూరులో చేయిస్తా" నని సమాధానపరచి నన్ను తన యింటికి తీసుకెళ్ళారు. నా ఆనందానికి మేర లేక పోయింది. ఆనాడే శ్రీమాజేటి రామచంద్ర రావు, శ్రీ జవ్వాజి అప్పారావుగుప్త, శ్రీ చింతాసోమరాజు వగైరా మా పార్టీ యువక నాయకులను రప్పించి ఆలోచించి కార్యాచరణకు ప్లానువేశాము. జరుగబోయే వితంతు వివాహాన్ని ఏలూరులోని వైశ్య యువకుల నందరిని సంఘటితపరచి,

[illegible]తో నారాయణరావు గారి నాయకత్వాన జరపాలని తీర్మానించుకున్నాము.

శ్రీ మద్ది వెంకటసుబ్బయ్య గారికి కలిగిన చిక్కులు, కష్టాలు తెలిసిపోయి నందున ఏ పట్టణంలో వివాహం చేయించినా అక్కడి వైశ్య సంఘ నాయకుల ఆట కట్టించుటకు వారి కొడుకులనో, అల్లుళ్ళనో, మనుమలనో మా ఉద్యమంలోకి దింపడం అవసరమని తోచింది. శ్రీ మోతేనారాయణరావు గారు చేరడంతో శ్రీ గంగరాజుగారు మొదలైన వైశ్యనాయకుల ఆటకట్టించగలమని ఆశించాము.

బళ్ళారి నుండి ఒక మిత్రుడొక యువతిని నా వద్దకు పంపారు. ఆ వితంతువుకు వివాహం చేయించాలి. బళ్ళారిలో గుమాస్తాగా వున్న గుంటూరు యువకునికి ఆమెకు వివాహం చేయించుటకు నిశ్చయించాము. నారాయణరావు గారు వ్యాపార నిమిత్తం కల్కత్తాకు వెళ్ళారు. పెండ్లిరోజుకు వస్తానని హామీ యిచ్చారు. శ్రీమాజేటి రామచంద్రరావు వగైరాలు వివాహం గొప్పగా చేయించాలని పెద్ద పెద్ద ఏర్పాట్లు సాగించారు. శ్రీ గంగరాజు వగైరాలు ప్రతిఘటింప పూనుకున్నారు. వారు శ్రీమంతులు. అనేకమంది వైశ్యులకు అప్పుసప్పులిచ్చి తమ పలుకుబడిలో వుంచుకున్నారు. పగ సాధించాలంటే ఎవరినైనా చిక్కుల్లో పెట్టగలరు; అప్పుపత్రాలను కొని దివాలా తీయించగల సమర్థులు. అయినప్పటికీ, ఆయనను లక్ష్యపెట్టని ధనికులు, వ్యాపారస్థులు కూడా ఏలూరులో వున్నారు.

గుంటూరులో నేర్చుకొన్న గుణపాఠంతో మేము బహిరంగ సభలు మానేశాము. వివాహానికి రెండు రోజులు ముందుగా శ్రీ గంగరాజుగారి పార్టీ వైశ్యుల సభ నొకదాన్ని పెట్టారు. ఆ సభకు వచ్చిన వారిలో ఎక్కువ మంది మా పార్టీవారే. వృద్ధుల ఆట సాగలేదు. సభ మధ్యలో లేచిపోయి, శ్రీ గంగరాజుగారి మేడలో రహస్యంగా చేరి కులబహిష్కారం చెయ్యడానికి తీర్మానించారు. తలవని తలంపుగా శ్రీరంగంవారి (బలభద్రపు రామకృష్ణయ్య) పార్టీవారు పూర్తిగా మాతో కలిసి పనిచేయసాగారు. శ్రీ నారాయణ రావుగారు లేని సమయంలో శ్రీరంగంగారు నాయకత్వం వహించి ధైర్యసాహసాలతోనే కాక, అతి చాకచక్యంగా పనులు నిర్వహించారు. స్థానిక వైశ్యయువకులు మాతో కలిసి పనిచేశారు. వృద్ధులలో కూడ కొందరు మా పక్షమే. స్త్రీలనేకమంది ముందుకు వచ్చి తోడ్పడ్డారు.

## వరాపహరణం

పెండ్లికి ముందురోజున గంగరాజుగారు వరునికి రు.5000/-లు లంచమిచ్చి, వేరే వివాహం ఏర్పాటు చేయడమేగాక, వరుణ్ణి దాచిపెట్టేశారనే వదంతి తెలిసి ఇంటికి వెళ్ళి పేరంటానికి పిలుస్తున్న మా పార్టీ స్త్రీలు నిరుత్సాహపడి పిలుపులు మనేశారు. పెళ్ళి ప్రయత్నాలు పూర్తిగా మానేస్తారని బయపడ్డాము. శ్రీరంగంగారే అధైర్యపడ్డారు. "మాగంగరాజుగారి నడత మీకు తెలియదు. వరుణ్ణి తీసుకురం"డని నాకు వార్నింగు ఆజ్ఞయిచ్చారు. నాకేమీ తోచలేదు.

నూటికి నూరుపాళ్ళు నేను చేసేది న్యాయమనీ, ఏం చెయ్యాలో తోచనప్పుడు, కార్యసాఫల్యానికి సాత్వికమార్గం కనబడనప్పుడు అప్రయత్నంగా నేను దౌర్జన్యానికి దిగుతాను. ఈ పద్ధతి నా రెండో స్వభావంగా ఏర్పడి పోయింది. గంగరాజు గారిని లొంగదీయ డానికి దౌర్జన్య మార్గం మాత్రమే కనపడింది.

శ్రీ గంగరాజు గారికి నా యందెంతో వాత్సల్యం, గౌరవం వుండేవి. నన్ను భోజనానికి ఆహ్వానించి తాను నాతో కూర్చుని అది, ఇది వడ్డించండని చెపుతూ, బాగా తినమని నన్ను నిర్బంధించేవాడు. అల్లుళ్ళకైనా అలాంటి మర్యాద చేసే వాడుకాదు. అలాంటి మేమిద్దరం రెండు పార్టీలకు నాయకులుగా పోట్లాడవలసిన సందర్భం ఏర్పడింది.

గంగరాజుగారు ఎంత ఐశ్వర్యవంతులైనా అతి భయస్తుడు. కానిస్టేబులు వచ్చి ఇన్‌స్పెక్టరుగారు పిలుస్తున్నారంటే వెళ్ళారు. ఇన్‌స్పెక్టరు తన యింటికి వస్తే కుర్చీలో కూర్చునే వరకూ తాను నిలబడేవారు. అలాంటి వారిని బెదరించడం సులభమేగదా!

వెంటనే గంగరాజు గారి యింటికి వెళ్ళాను. ప్రతికక్షులెందరో వున్నారక్కడ. ఎటూ చూడకుండా తిన్నగా గంగరాజుగారి వద్దకు వెళ్ళగానే "కూర్చోండి, కూర్చోండి" అని మర్యాద ప్రారంభించారు. "మీతో ప్రత్యేకంగా మాట్లాడాలి! వరండాలోకి రండ"ని దారి తీశాను. మీ యందు నాకెంతో గౌరవమున్నదని మీకూ తెలుసు. వివాహ విషయంలో రెండు పార్టీలుగా చీలిపోయాము. మనమిద్దరమే రెండు పక్షాలకు నాయకులం. న్యాయంగా పోట్లాడుదాం! మా వరుణ్ణి దాచిపెట్టావు. అది న్యాయం కాదు" అన్నాను. "లేదు లేదు. దాచిపెట్టలేదన్నారు గంగరాజుగారు. "నా సంగతి తెలుసుకదా! నాలుగున్నర సంవత్సరాలు ఏడు జైళ్ళలో గడిపాను. జైలరును తన్నాను. నాకు కోపంవచ్చి ఏమైనా చేస్తే ఏ ఆరుమాసాలో జైల్లో వుండక తప్పదు. కాని నీకో! తరతరాలుగా వున్న గౌరవం పోతుంది, మరి నీ యిష్టం, ఆలోచించుకో" అని బెదిరించాను. భయపడిపోయాడు. "దాయలేదు, ఇప్పుడే నీతో పంపుతా, తీసుకెళ్ళు"మన్నాడు అలా కాదు. మాజేటి వారి యింటికి పంప మన్నాను. సరేనన్నారు. నేను మాజేటి వారింటికి వెళ్ళి నా పార్టీవారిని కలుసుకొని, జరిగింది చెప్పాను. "అయ్యో! ఆ మోసగాని మాటలు నమ్మి వచ్చావా? వరుణ్ణి పంప"దని నిరుత్సాహపడ్డారు. అంతలో వరుడు బండిలో నుండి దిగాడు. నా స్నేహితులు ఆశ్చర్యపడ్డారు. మరింత ఉత్సాహంతో పని సాగించారు.

నారాయణ రావు మెయిలులో వస్తున్నామని మాకు టెలిగ్రాము యిచ్చారు. ఆయన్ను రానివ్వకుండా బెజవాడలోనే ఆపివెయ్యడానికి ఆ రాత్రే కొందరిని గంగరాజు పంపుతున్నట్టు మాకు తెలిసింది. అంతకంటే పెద్ద ప్లానును మా నాయకుడు శ్రీ రంగంగారు వేశారు. నారాయణరావు గారిని తెనాలి లోనే కలుసుకోమని మేము కొందరిని పంపాము. "గంగరాజు బాబాయి" గారితో ఎదురుపడి

పోట్లాడడం నారాయణరావుగారికి ఎంత మాత్రం యిష్టం లేదు. ఒక ఉపాయం చెప్పారు! "గంగరాజుగారి ఏజంట్లు చెప్పినట్లే బెజవాడలోనే ఉంటానని టిగేస్తాను. వారిని నమ్మించి ఏలూరు పంపేస్తాను. నేను ఉదయం ప్యాసింజరుతో బయలుదేరి వస్తాను. వట్లూరు స్టేషనుకు కారు పంపం"డని కబురంపారు. అలాగే చేశాం. కాని, కారులో తిన్నగా వివాహం జరిగేలావుకు రాకుండా, తన యింటికి వెళ్ళారు రావుగారు.

వారెంత ముందడుగు వేస్తారో; ఆయన తల్లి, భార్య అంతా వెనుకకు లాగుతారు. పెళ్ళికి వెళ్ళొద్దని నిర్బంధించారు. కూతుళ్ళకు వివాహాలు జరగవనీ, జరిగినా సరియైన సంబంధాలు కుదరవనీ, ఇతరుల గొడవలు తమకెందుకనీ చెప్పడమేగాక, పోనిచ్చేదిలేదని గుమ్మానికడ్డంగా భార్య కూర్చున్నారు. "గంగరాజు గారు వస్తున్నారు, ఇంటిదగ్గరే వుండమన్నా"రనే కబురు వెళ్ళింది. వెంటనే ఒక్కదూకుతో గుమ్మందాటి కారులో వివాహ స్థలానికి వచ్చారు.

మా పార్టీ వారికి ధైర్యం చిక్కింది. వివాహం జరుగుతూండగా గంగరాజుగారు వీధిలో కారులోనే వుండి, నారాయణ రావును రమ్మని కబురంపారు. "వివాహం పూర్తి చేయించి భోంచేసివస్తా"నని చెప్పి పంపారు నారాయణరావుగారు.

వివాహం వైభవంగా జరిగింది. వేల మంది భోంచేశారు. వరునికి బహుమతులు చదివించారు. శ్రీ నారాయణరావుగారే రు. 116 లతో ప్రారంభించారు. మొత్తం రు. 1116 లకు పైనే చదివించారు. సాయంత్రంవూరేగింపులో వేలాదిజనం పాల్గొన్నారు. ఉత్సాహం వెల్లివిరిసింది. రాత్రికి వధూవరులకు నిషేకం ఏర్పాటు చేసే విషయంలో "మా యింట్లో, మా యింట్లో"నని పోటీలుపడ్డారు! అప్పుడూ యిప్పుడూ కూడా వితంతు వివాహాల విషయంలో కుటుంబమంతా కలిసి ఉత్సాహంతో సహాయపడుతున్న శ్రీ జవ్వాజి అప్పారావుగుప్తగారి యింట్లో ఏర్పాటును ఏకగ్రీవంగా అంగీకరించాము. వధూవరులను పాన్పుమీద కూర్చోబెట్టి నప్పుడు నారాయణరావు గారు "బ్రహ్మ వ్రాత అంటారే! అదెక్కడికిపోయింది యిప్పుడు? మన వ్రాత మన చేతుల్లోనే వున్న"దని సయమస్ఫూర్తిగా మాట్లాడారు. అనేకమంది వధూవరులను ఆహ్వానించి విందులుచేసి బహుమతులిచ్చారు. ఈ విధంగా వివాహము దిగ్విజయంగా జరిగిపోయింది.

## ఎత్తు పై ఎత్తు

అయితే, మరునాడే వివాహంలో పాల్గొన్న వారిని బహిష్కరించేందుకు గంగరాజు గారు సభ నేర్పాటు చేశారు. వైశ్యులందరు రావలసిందని నోటీసులు పంపారు. అదే వారి పొరపాటు. మేమందరం ప్లాను వేసుకొని వెళ్ళాం. ఎవరెవరెలా మాట్లాడాలో, ఏమి తీర్మానం చెయ్యాలో నిశ్చయించుకున్నాం. శ్రీ నారాయణరావు గారే అధ్యక్షుడుగా వుండటానికి సమ్మతించారు.

( ఇంకా ఉంది )

# మానవ మనుగడపై జ్యోతిశ్శాస్త్ర ప్రభావము

రచన : నల్లసాని వేణుగోపాల్, బి.ఎ., ధర్మవరము.

సకల చరాచర సృష్టి స్థితి, లయకారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, ప్రకృతి, జలచరాలు, వనచరాలు, మానవులు, అసుర, దేవగణాలు యావత్తు శాస్త్ర ప్రభావానికి లోబడి తమ మనుగడ సాగించుచున్నారు. అనే దానికి అనేక సాక్ష్యాధారాలను మనము శాస్త్రాల ద్వారా తెలుసుకొన్నాము.

జ్యోతి శ్శాస్త్రము అంటే ఏమిటి? ప్రకాశవంతము చేయుట. అంటే అంధకారమున వున్నదాన్ని వెలుగునకు తెచ్చునదియే జ్యోతి. అదియే జ్యోతిశ్శాస్త్రము.

శాస్త్రమునకు "ఓంకార నినాద శక్తి" స్వరూపిణియే మూలమంటారు. అట్టి మహాశక్తి సహా కొన్ని కట్టుబాట్లకు లోబడి ఒకప్పుడు, భీకరాకృతితోను, మరి ఒకప్పుడు శాంత, కరుణ, గంభీర రసాలతో దర్శనమిస్తూ వుంటుంది. అలాగుననే మానవుడు సహా, వాని దశా ప్రభావాల వల్ల ఒకప్పుడు ధనికుడుగాను, మరొకప్పుడు దరిద్రుడుగానుమార్పు చెందుతూ వుంటాడు. దీనికి మూలము వాడి జన్మనాటి ప్రభావము.

జ్యోతి శాస్త్రము అసంబద్ధమనియు, ఇది ఒక మూఢనమ్మకమనియు నమ్మి జీవితాలను వ్యర్థము చేసుకోవద్దు. అనే వదంతి సహా మనకు అప్పుడప్పుడు వినిపిస్తూ వుంటుంది. ఇది ఎంతవరకు సమంజసము?

కాళిదాసు, జైమిని, వ్యాసభగవానులు, ఖగోళశాస్త్ర పరిజ్ఞాని వరాహమిహిరుడు మున్నుగాగల మహామహులెందరో యీ శాస్త్రాన్ని మథించి అనేక అద్భుత విషయాలను మానవాళికి అందించి వారి జీవితాలను పునీతమొనర్చుకొన్నారు.

దక్ష ప్రజాపతి తనయులే అశ్వని మొదలు. రేవతి అనబడు ఇరవై ఏడు నక్షత్రాలు. వారి ఆరాధ్యుడే సోముడనియు అనగా చంద్రుడని మనము శాస్త్రాలను అధ్యయనము చేస్తే మనకు ద్యోతకమవుతుంది.

ప్రకృతి యందు వర్షాలు పడుట, ఆ నక్షత్ర ప్రభావాలను బట్టియే, చిత్తయందు చిత్తు, చిత్తుగా వర్షాలు వస్తాయి అనేది, ఉత్తర చూచి ఎత్తర గంప అనే నానుడి మనకు వినిపిస్తూ వుంటుంది. అంటే, ఆ నక్షత్రాలు ప్రకృతిపై ఎలాంటి ఆధిపత్యాన్ని పొందాయి అనేది మనకు స్పష్టంగా అర్థమవుతుంది.

చైత్రము, వైశాఖము మొదలు పాల్గుణ మాసాలు పన్నెండు సహా ఈ నక్షత్ర నామధేయాలే. ఉదా:- చిత్త నక్షత్రమే చైత్రమాసమని, విశాఖ నక్షత్రమే వైశాఖ మాసమని, పల్గుణి నక్షత్రమే పాల్గుణ మాసమని మనము గ్రహించాలి. ప్రకృతి, పురుషుడు "భ" చక్రము పై ఆధారపడి మానవ జీవితాలకు చుక్కానిగా వుంటే, మానవునిపై గ్రహ ప్రభావము లేదనుట హాస్యాస్పదము.

వర్షాకాలాన వర్షాలు, ఎండాకాలాన ఎండలు, చలి కాలాన చలి, గాలి కాలాన గాలి వస్తాయి. అన్నది శాస్త్రజ్ఞులు శాస్త్ర

పరిజ్ఞానముతో నిర్దేశించినదే అనుట ముఖ్యంగా మనము గుర్తుంచుకోవాలి.

"హోర" అనగా హవర్ (Hour) అనునది కాలమని గుర్తించాలి. హోర అనుట జ్యోతిశాస్త్రము నుండి ఉద్భవించినది. హవర్ పాశ్చాత్యులు ఇచ్చిన పదము. ఘడియలు, విఘడియలకు బదులు, గంటలు, నిముషాలు వారొసగిన నామధేయాలు. దీనిని బట్టి మన ప్రాచీన శాస్త్రముపైననే వారు ఆధారపడినట్లు మనకు అవగతము అవుతుంది.

అనగా ఈ సర్వ ప్రపంచము ఈ శాస్త్ర ప్రభావము తోనే కాలగమనాన్ని నిర్దేశించారనేది సుస్పష్టమవుతుంది.

ఎపుడో రాబోయే, చంద్రగ్రహణ, సూర్యగ్రహణాలను యిపుడే శాస్త్రజ్ఞులు ఎలా నిర్ణయించారు. పంచాంగాలను ఎలా తయారు చేయగలిగారు. అమావాస్య, పౌర్ణమిని ఎలా నిర్దేశించారు. పక్షానికి ఒక దఫా వచ్చే అమావాస్య, పౌర్ణమిలు నెలకు రెండు దఫాలుగా దర్శనమివ్వచ్చు కదా, మరి అలా జరగడం లేదు కారణం శాస్త్రము.

ఇన్ని ఉదాహరణాలను బట్టి చూస్తే జ్యోతిశాస్త్రము ఒక మూఢనమ్మకము అనుట పొరపాటు, అపద్ధము కాదు సత్యమని మనకు తెలుస్తూ వున్నది.

ప్రపంచములో నూటికి తొంబయి మంది నేడు ఎందుకు పంచాంగాలపై ఆధారపడుతూ వున్నారు. మేధావులు కాని, శాస్త్రజ్ఞులు కాని, సాధారణ జనావళి కాని వారి హృదయాలపై చేయి వేసుకొని చెప్పమనండి. నూటికి తొంభై మంది ఎపుడో ఒకప్పుడు ఈ శాస్త్రాన్ని నమ్మినవారే.

కాల జ్ఞానాన్ని ప్రసాదించిన శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రులు, పాశ్చాత్యులలో "అమష్టర్" అనే మేధావి రాబోవు భవిష్యత్తును, ప్రళయాన్ని, మానవ అధఃపతనాన్ని దేశదేశాల అంతరహ బహిర్ యుద్ధాలను ఎలా నిర్దేశించారు. యిది అంతా శాస్త్ర ప్రభావమే తప్ప వేరు కాదు.

కాని, జ్యోతిశాస్త్రము అంటే హృదయ భావాలను జ్యోతిర్మయము కావించుట, ప్రకాశవంతము చేయుట అని అర్థము. దీనికి మూలము గణితము.

సంఖ్యాశాస్త్ర పరంగా మానవుని జన్మ గ్రహనాడులను సరైన గుణింతము చేస్తే సరైన ఫలితాలను సాధించవచ్చు. గుణింతము గురి తప్పితే, ఫలితాలు గతి తప్పుతాయి. ఉదా: లగ్నాన్ని బట్టి, జాతకుని రంగు, రూపము, ఆకృతి, ప్రభావాలను చెప్పవచ్చు. గ్రహదృష్టి ప్రభావాలు పరివర్తన గృహస్థితిని క్షుణ్ణంగా పరిశోధన చేస్తే సరైన ఫలితాలను సాధించవచ్చు. అట్లుకాక, మిడిమిడి జ్ఞానముతో నిర్దేశిస్తే ఫలితాలు వ్యతిరేకమవుతాయి. అపుడే జాతకునికి శాస్త్రముపై నమ్మకము పోతుంది.

"మనోధృడము మాండవ్యము" కానున్నది కాక మానదు, పోనున్నది పోక మానదు అని అనుకుంటే రోగము వచ్చినపుడు వైద్యుని వద్దకు ఎందుకు వెళ్ళాలి? కాని, రోగి వైద్యుని వద్దకు వెలుతూనే ఉన్నాడు, రోగాన్ని బాగు చేసుకుంటూనే ఉన్నాడు.

అదే విధంగానే సాధారణంగా మానవుడు సుఖ దుఃఖాలకు అలవాటైన నప్పుడు తన నాడిని శాస్త్ర రీత్యా గ్రహించి జీవితాలను సుఖవంతము చేసుకుంటే బాగావుంటుందని అభిప్రాయము.

విజ్ఞాన శాస్త్రము కాని, వైద్యశాస్త్రము కాని, జ్యోతి శాస్త్రము కాని, ఏ శాస్త్రమైన సరియైన అవగాహన చేస్తే సరియైన సమాధానాలు లభిస్తాయి. గురి తప్పితే గుర్తింపు ఉండదు లక్ష్యాన్ని చేరుకోలేడు.

సకల చరాచర సృష్టియావత్తు ఏదో ఒక అజ్ఞాత శక్తికి లోబడి మనుగడ సాగిస్తూ వున్నదని, ఆ ఓంకార నినాద శక్తికి సాష్టాంగ దండప్రణామమొనరించి, ఆ చల్లని తల్లి దీవెనలనొంది జన్మను చరితార్థము చేసుకోవాలని మనసా, వాచా, కోరుతూ వున్నాను.

## నామకరణము

కర్నూలు జిల్లా నంద్యాల వైశ్య ప్రముఖులు శ్రీ తిరునీదుల రామాంజనేయులు శ్రేష్ఠి గారి కుమారుడు చి॥ జగదీశ్ నామకరణ మహోత్సవము 23.12.1993వ తేదీన నంద్యాల లోని వారి స్వగృహము లో వైభవంగా జరిగింది.

## భృగుమళ్ళ వెంకట రత్నం గారి స్వర్గారోహణ

విజయవాడ పుర ప్రముఖులు ఇండస్ట్రీస్ వ్యవస్థాపకులు శ్రీ భృగుమళ్ళ వెంకట రత్నం (బి.వి.రత్నం) గారు 23.12.1993వ తేదీన స్వర్గస్తులయ్యారు.

## బొబ్బిలిలో ఆర్యవైశ్య సంఘం

విజయనగరం జిల్లాకు చెందిన బొబ్బిలి పట్టణములో గల సుమారు 78 ఆర్యవైశ్య కుటుంబాల వారు 12.12.1993వ తేదీన కార్తీక వన భోజన సందర్భంగా సమావేశమై స్థానికంగా వారికొక ఆర్యవైశ్య సంఘమును ఏర్పాటు చేసుకొనుట ఆవశ్యకమని భావించి "బొబ్బిలి పట్టణ ఆర్యవైశ్య సంఘము"ను ఏర్పాటు చేసుకొని ఈ క్రింది వారితో కార్యవర్గమును ఏర్పరచుకొన్నారు. అధ్యక్షులు శ్రీ పూసర్ల సంగమేశ్వరరావు. ఉపాధ్యక్షులు శ్రీ బొడ్డు వెంకటరమణయ్య, శ్రీ పూసర్ల సత్యనారాయణ, కార్యదర్శి శ్రీ పసుమర్తి వెంకట.పాపారావు, సహాయక కార్యదర్శులు శ్రీ పూసర్ల గున్నేశ్వర రావు, కొత్తరాజ, కోశాధికారి శ్రీ గంధి బాబు, విజయనగరం జిల్లా సాలూరు పుర ప్రముఖులు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య ఆంధ్రప్రదేశ్ కార్యవర్గ సభ్యులు శ్రీ అరిశెట్టి గున్నయ్య గుప్త గారు ఈ సంఘమును ఏర్పాటు చేయుటలో ప్రముఖ పాత్ర వహించారు.

# వైశ్య ప్రబోధిని – క్యాలెండరు

( 1994 జనవరి 21 నుండి 1994 ఫిబ్రవరి 20 వరకు )

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 23 | 30 | 6 | 13 | 20 |
| సోమవారము | | 24 | 31 | 7 | 14 | |
| మంగళవారము | | 25 | ఫిబ్రవరి 1 | 8 | 15 | |
| బుధవారము | | 26 | 2 | 9 | 16 | |
| గురువారము | | 27 | 3 | 10 | 17 | |
| శుక్రవారము | 21 | 28 | 4 | 11 | 18 | |
| శనివారము | 22 | 29 | 5 | 12 | 19 | |

జనవరి 24 :– శ్రవణ కార్తె – ఉదయం 8.52

జనవరి 25 :– A-2 రిటర్నును చలానాతో బాటు అమ్మకపు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి

జనవరి 26 :- సంపూర్ణ స్వాతంత్ర్యదినము (రిపబ్లిక్ డే) - జాతీయ సెలవు దినము - దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు-
సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

జనవరి 30 :- గాంధీ నిర్యాణ దినము - మృతవీరుల సంస్మరణ దినము.

ఫిబ్రవరి 6 :- ధనిష్ఠ కార్తె - ఉదయం 11.03.

ఫిబ్రవరి 11 :- మాఘస్నానారంభం.

ఫిబ్రవరి 12 :- శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి ఆత్మార్పణ దినం.

ఫిబ్రవరి 13 :- రంజాన్ నెల.

ఫిబ్రవరి 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతోబాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన
అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు తారీఖు.

ఫిబ్రవరి 17 :- రథ సప్తమి

ఫిబ్రవరి 18 :- భీష్మాష్టమి

ఫిబ్రవరి 19 :- శ్రీ రామకృష్ణ పరమహంస జయంతి. శతభిష కార్తె - పగలు 2.23

**23, 30, 6, 13, 20 ఆదివారాలు**

---

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్ల " VASAVI "

టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114, పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :- 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత్ల ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల :</u> తిరుమలలో నిర్మించుచున్న నాలుగు అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

I&II ఫ్లోరు రూము డోనార్సు : 10 రూములకు పరిమితము. ఒక లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు సంవత్సరంలో 30 రోజులు రూము యివ్వబడును. వారి ఫోటో శిలా ఫలక రూములో వేయబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్షరూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును. 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో శిలా ఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. త్వరలో తిరుమలలో ఆఫీసు ఓపెన్ చేస్తాము. అంతవరకు పై అడ్రసుకు పంపకోర్తాము.

4. <u>వాసవీ నిలయం, పెనుగొండ :</u> పరిశీలనలో ఉంది.

5. <u>వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి</u>

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్నా ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ

పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యుల విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వేయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారం పర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వేయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వేయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

## 6. వాసవీ వార్షిక మహాక్రతువు :

19.1.1994 నుండి 27.1.94 వరకు పశ్చిమ గోదావరి జిల్లా పెనుగొండలో జరిపి ప్రపంచశాంతి చేయబడును.

భారత దేశములోగల పై పేరుతో ఏదో ఒక మహాక్షేత్రములో లేక మహా పట్టణములో ప్రతి సంవత్సరము జనవరి 19వ తేదీ నుండి 9 రోజులు 108 హోమ గుండములతో గుండమునకు నలుగురు దంపతులచే శ్రీశ్రీశ్రీ శివచరణం బ్రహ్మచారిగారి పర్యవేక్షణలో మహాక్రతువును నిర్వహించబడును.

ఈ సందర్భముగా మేధావులయిన ఋత్విక్కులచే చతుర్వేదముల పారాయణ, గీతాపారాయణలు, అహర్నిశాదులు, నామభజనలు, ఎందరో ప్రఖ్యాతి గాంచిన మహనీయుల ఆశీర్వచనములు, ఉపన్యాసములు, లక్ష దీపాలంకరణములు - ప్రఖ్యాతి గాంచిన భజంత్రీలచే వాయిద్యములు, ఆధ్యాత్మిక కార్యక్రమములు, యజ్ఞములో పాల్గొను వారికి వసతులు, భోజనములు, ఉపాహారములు, యజ్ఞము తిలకించుటకు విచ్చేయు వారికి భోజనముల ఏర్పాట్లు కలవు.

కన్నుల పండువు కలిగించులాగున అత్యధిక విద్యుత్ అలంకరణ, అలంకారమైన విశేష పందిళ్ళు, పై ఏర్పాట్లన్నియు, సుమారు 10 ఎకరముల విస్తీర్ణముగల భూమిలో విస్తృతంగా చేయబడును.

యజ్ఞములో పాల్గొనదలచినవారు వారి సీట్లను ముందుగా రిజర్వు చేయించుకొన కోర్తాము. ఆలసించిన సీట్లు దొరకుట దుర్లభము.

1993 మార్చి 10 నుండి 18 వరకు తిరుపతి తిరుచానూరులో బ్రహ్మాండముగా మహాక్రతువు జరుపబడినది.

1994 జనవరి 19వ తేదీ నుండి 27వ తేదీ వరకు పశ్చిమ గోదావరి జిల్లా పెనుగొండ అనగా మన కుల దేవత శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవి గారి జన్మ స్థలములో జరుపబడును.

## విరాళములు

1. రు.252-00 సమర్పించిన 9 రోజులలో ఒక రోజు ఒక హోమగుండములో ఒక వైపు తను దంపతులు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. యజ్ఞమునకు కావలసిన అన్ని వస్తువులు సంఘమువారు ఉచితముగా సప్లయిచేయుదురు.
2. రు.316-00 సమర్పించిన ఒక రోజు 100 మందికి అన్నదానము చేయుచున్నట్లు ప్రకటించబడును.
3. రు.1116-00 సమర్పించిన దాతలకు ఒక రోజు యజ్ఞములో ఒక సీటు, ఒక రోజు 100 మందికి అన్నదానం మరియు వీరి వంశపారంపర్యంతం యీ సంఘముల సభ్యత్వము యిస్తూ శాశ్వతముగా ఎక్కడ యజ్ఞము జరిగినా ప్రసాదం పంపబడును
4. ఇంకా దాతలు దీపాలంకరణమునకు నూనె డబ్బాలు, అన్నదానమునకు బియ్యం బస్తాలు, పప్పులు, నెయ్యి వగైరా వస్తువులు, యథాశక్తిగా సమర్పించి ఈ మహత్కార్యమును జయప్రదము చేసి ప్రపంచ శాంతిని చేకూర్చి సర్వేజనాః సుఖినోభవంతు చేయించుటకు తోడ్పడకోర్తాము.

-: ప్రత్యేక, ఉత్తర ప్రత్యుత్తరములకు :

**మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,**
**మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.**
**అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.**

**N.B** పై సత్రముల పేరుతో - D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వాసవీ వార్షిక మహాక్రతువు నిర్వాహణా కమిటి

## అధ్యక్షులు

శ్రీ ఆత్మకూరు నాగభూషణం శెట్టి గారు, నంద్యాల

## ఉపాధ్యక్షులు

శ్రీ ప్రొద్దుటూరు జంగయ్యగుప్త గారు, హైదరాబాదు
శ్రీ వి. ఎంబెరుమన్నారుశెట్టి గారు, మద్రాసు
శ్రీ చలువాది శ్రీనివాసులు గారు, విజయవాడ
శ్రీ లింగాల రామయ్యగారు, జమ్మలమడుగు

## కోశాధికారి

శ్రీ పెరుమాళ్ళ కోటేశ్వరరావుగారు, మార్కాపురం

## చీఫ్ కంట్రోలర్స్

శ్రీ గుండా మోహనరావుగారు, బేతంచెర్ల
శ్రీ కోట్ల వెంకట్రామయ్య గారు, పెనుగొండ
శ్రీ బొండాడ రాధారమణగుప్త గారు, పాలకొల్లు
శ్రీ పి.రామమూర్తిగారు, బెంగుళూరు

## కంట్రోలర్స్

శ్రీ డింటకుర్తి రంగస్వామిగారు, కర్నూలు
శ్రీ దారా రామనరసింహంగారు, కొత్తగూడెం
శ్రీ బచ్చు నరసింహారావుగారు, విజయవాడ
శ్రీ వాకాటి తిరిపేలుగారు, కోవూరు
శ్రీ దేవకి వెంకటసుబ్బయ్య గారు, బాపట్ల
శ్రీ నెరవాటి సత్యన్నారాయణ గారు, నంద్యాల
శ్రీ లగిశెట్టి సుబ్బగురుమూర్తి గారు, నంద్యాల
శ్రీ పెసల శ్రీనివాసులుగారు, నంద్యాల
శ్రీ సాధు సుబ్రహ్మణ్యంగారు, గుంటూరు
శ్రీ కొత్తమాసు విశ్వనాథంగారు, తిరుపతి

## సభ్యులు

శ్రీ మంచికంటి నారాయణగుప్తగారు, మార్కాపురం
శ్రీ శిఖాకొల్లి నరసింహస్వామిగారు, సంతనూతలపాడు
శ్రీ దేవకి వెంచయ్యగారు, మార్కాపురం
శ్రీ పెర్ల వెంకయ్యగారు, పొదిలి
శ్రీ జి.వి. సత్యన్నారాయణగారు, బుక్కపట్నం
శ్రీ గుండా వెంకటేశ్వర్లుగారు, గుంటూరు
శ్రీ తెలుగుంట్ల బాలసత్యన్నారాయణగారు, విజయవాడ
శ్రీ చాట్ల వెంకటసుబ్బయ్యగారు, పార్వతీపురం
శ్రీ అచ్యుత మల్లికార్జునరావుగారు, వినుకొండ
శ్రీ ఇ.పి. సత్యన్నారాయణగారు, ఎస్.పి. కాలనీ
శ్రీ పుట్టా వెంకటేశంగారు, కడప
శ్రీ యిమ్మడిశెట్టి కోటేశ్వర రావు గారు, ఎస్.పి. కాలనీ
శ్రీ కంతేటి యతిరాజారావుగారు, విజయవాడ
శ్రీ యిల్లూరు సత్యన్నారాయణ గారు, కర్నూలు
శ్రీ ఎస్.ఎ. పార్థసారథిగారు, బంగారు పేట

## కార్యదర్శి

శ్రీ మూర్తి వెంకటేశ్వర్లుగారు, మార్కాపురం

## సహాయ కార్యదర్శులు

శ్రీ మంచికంటి వెంకటసుబ్బారావు గారు, నంద్యాల
శ్రీ కేసర్ల రఘురాంగారు, తిరుపతి
శ్రీ పారేపల్లి సాంబశివరావు గారు, బాపట్ల
శ్రీ యక్కలి తిమ్మిశెట్టి గారు, విజయవాడ

## చీఫ్ ఆర్గనైజర్స్

శ్రీ తూనుగుంట్ల సాంబశివరావుగారు, ఒంగోలు
శ్రీ కోట్ల వెంకటేశ్వరరావు గారు, పెనుగొండ
శ్రీ కోడూరు కేదారేశ్వరరావుగారు, పెనుగొండ
శ్రీ కోట్ల సత్యన్నారాయణగారు, పెనుగొండ

## ఆర్గనైజర్స్

శ్రీ చలువాది కామేశ్వరరావు గారు, మార్కాపురం
శ్రీ మూర్తి రామయ్యగారు, తర్లుపాడు
శ్రీ కాసుల వెంకటేశ్వర్లుగారు, మార్కాపురం
శ్రీ పబ్బిశెట్టి ద్వారకానాథ్‌గారు, ఒంగోలు
శ్రీ తడవర్తి కోటేశ్వరరావుగారు, శింగరాయకొండ
శ్రీ కొత్త చంద్రమౌళిగారు, తర్లుపాడు
శ్రీ మంచికంటి సుబ్బయ్యగారు, కావలి
శ్రీ ముల్లూరు వెంకటరమణయ్యగారు, కర్నూలు
శ్రీ తడికమల్ల లక్ష్మి సుబ్బయ్య గారు, మార్కాపురం
శ్రీ కోనర చంద్రశేఖర్ గారు, తిరుపతి

## సభ్యులు

శ్రీ చలువాది వెంకటసుబ్బారావుగారు, ఒంగోలు
శ్రీ పాలువాది వెంకటరత్నంగారు, మార్కాపురం
శ్రీ ఆత్మకూరు అంకాళయ్యగారు, రెంటచింతల
నేరెళ్ళ పాపారావుగారు, వినుకొండ
శ్రీ జల్లా అనంతరామయ్యగారు, గుంటూరు
శ్రీ వేమా రామలింగయ్యగారు, ఎస్.పి. కాలనీ
శ్రీ మంచికంటి మహానందిగారు, పొదిలి
శ్రీ బాదం రాములు గారు, కంభం
శ్రీ యక్కలి తిమ్మయ్యశెట్టి గారు, మార్కాపురం
శ్రీ పెరుమాళ్ళ నాగయ్య గారు, గురజాల
శ్రీ సుగ్రీవు సత్యన్నారాయణగారు, మార్కాపురం
శ్రీ దరిశి నరసింహారావుగారు, గుడివాడ
శ్రీ వితా సుబ్బారావుగారు, ముండ్లపాడు
శ్రీ కొత్తూరు గోపాలకృష్ణయ్య గారు, గుంటూరు
శ్రీ సామిశెట్టి బాలఈశ్వరయ్య గారు, కొల్లాపురం

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాధంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

రావణ కుమారుడు అంగదుణ్ణి తన్నడానికి కాలు పైకి ఎత్తాడు. వెంటనే అంగదుడు ఎత్తిన కాలు ఎత్తినట్లే పట్టుకొని గిర్రున తిప్పి నేల కేసికొట్టాడు. ఈ వీరుణ్ణి చూడగానే రాక్షసులంతా భయపడి ఎక్కడి వారక్కడ పరుగెత్తిపోయారు. దాంతో నగరమంతా కలకలం బయలు దేరింది. లంక కాల్చి వేసి పోయిన వాడే మళ్లీ వచ్చాడని అనుకుంటూ వున్నారు.

రామనామం చేస్తూ అంగదుడు రావణ సభాద్వారం వద్దకు వెళ్లాడు. సింహంలాగా ఠీవిగా అటూ ఇటూ చూశాడు. లోపలికి వర్తమానం పంపాడు. రావణుని ఆజ్ఞ తీసుకొని లోనికి ప్రవేశించాడు. పర్వతాకారంతో ఆసీనుడై వున్న రావణుణ్ణి చూశాడు.

అంగదుడు సభలో ప్రవేశించగానే సభాసదు లందరూ లేచి నిలబడ్డారు. సభాసదులు లేచి నిలబడ్డందుకు రావణుడికి కోపం వచ్చింది.

మదించిన ఏనుగుల గుంపులో సింహం జొరబడ్డట్లుగా సభలో ప్రవేశించిన అంగదుడు రామ ప్రతాపాన్ని స్మరిస్తూ సభకు నమస్కరించి కూర్చున్నాడు.

"ఎవర్నువ్వు?" అడిగాడు రావణుడు.

అప్పుడు అంగదుడు "దశకంఠా, నేను శ్రీరామ దూతను. నా తండ్రి నీ స్నేహితుడు. కాబట్టి నీ మేలు కోరి నేను వచ్చాను. నువ్వు ఉత్తమ కులంలో పుట్టావు. పులస్త్య ఋషి మనవడివి. ఈశ్వరుణ్ణి, బ్రహ్మను బాగా పూజించిన వాడివి. వరాలు పొందావు. లోక పాలకులను, రాజులను జయించావు. రాజ మదం లోనో లేక మోహావేశం లోనో జగజ్జనని సీతాదేవిని హరించి తెచ్చావు. అయినప్పటికీ నా సలహా ప్రకారం చేశావంటే, రామచంద్ర ప్రభువు నీ అపరాధాలన్నీ క్షమిస్తాడు." అని నచ్చ చెప్ప బోయాడు.

అప్పుడు రావణుడు "ఒరేయ్, కోతీ, జాగ్రత్తగా మాట్లాడు. దేవతలకు శత్రువునైన నా ప్రతాపం నీకు తెలియడంలేదు. నీ పేరేమి? నీ తండ్రి పేరేమి? ఏ కారణంతో నాతో స్నేహాని కొచ్చావు?" అని అడిగాడు.

అందుకు అంగదుడు "నా పేరు అంగదుడు. వాలి కుమారుణ్ణి. నువ్వు మా తండ్రిని ఎప్పుడైనా కలుసుకున్నావా?" అని అడిగాడు.

వాలి పేరు వినగానే సంకోచించిన రావణుడు "అవునవును వాలి అనే వానరు డుండేవాడు. నువ్వేనా అతని కుమారుడివి. నీ వంశ నాశనానికే నీవు పుట్టినట్లున్నావు. మీ తండ్రి వాలి క్షేమమేనా? ఇప్పుడెక్కడున్నాడు" అని అడిగాడు.

అంగదుడు నవ్వుతూ "పదిరోజుల

తరువాత వాలి వద్దకు వెళ్ళి, కౌగలించుకొని నువ్వే స్వయంగా అతని క్షేమం అడుగు తావు. శ్రీ రామునితో విరోధం పెట్టు కొన్న వాళ్లకు ఎటువంటి సత్కారం జరుగుతుందో వాలి నీకు స్వయంగా చెబుతాడు. నీచుడా!" అంటూ నిందించాడు.

అంగదుని కఠోర వాక్కులు విని రావణుడు కళ్లెర్రజేసి "మూర్ఖుడా, మీ సైన్యంలో నాతో సమానమైన యోధు డెవరైనా వున్నారా? నా బల పరాక్రమాలు ఈశ్వరుడికే ఎరుక! నా తలలనే పుష్పా లుగా జేసి ఈశ్వరుడికి పూజచేశాను. నా భుజ బల పరాక్రమం దిక్పాలురకే ఎరుక. నేను జగత్ప్రసిద్ధుడైన రావణుణ్ణి. కుంభ కర్ణుడు నా సోదరుడు. ఇంద్రజిత్తు నా పుత్రుడు. అంగదా! నువ్వు ఎవరి బలంతో ఇలా మాట్లాడు తున్నావా వాడిలో బల పరాక్రమాలు లేవు. గుణహీనుడని తెలిసే అతని తండ్రి వనవాసానికి పంపాడు. భార్యా వియోగంతో ఇంకా కృశించి వున్నాడు. రాత్రిం బగళ్లు భయంతో గడుపు తున్నాడు." అంటూ వురిమి చూశాడు.

రావణుని మాటలతో అంగదుడి కోపం మరీ పెరిగి పోయింది. సింహనాదం చేశాడు. తన భుజదండాలతో సభా భూమిని కంపింప చేశాడు. భూకంపం ఏర్పడింది. సభాసదులు క్రింద పడ్డారు. రావణుడి కిరీటం క్రింద పడి దొర్లిపోయింది. దాన్ని పట్టుకొని అంగదుడు శ్రీ రాముని వద్దకు విసరి వేశాడు. కిరీటం ఆకాశ వీధిలో మెరయడం చూసి వానరులు నక్షత్రాలు విరిగి పడుతున్నాయని భయపడ్డారు.

ఆ కిరీటాన్ని హనుమంతుడు పట్టుకొని శ్రీ రాముడికి అందించాడు. వానరులు తమాషాగా చూస్తూ వున్నారు.

ఇక్కడ రావణుడు మితి మీరిన కోపంతో – ఈ కోతిని పట్టుకోండి, చంపివేయండి. ఎలుగులను, వానరులను కనపడ్డవాళ్లను కనపడ్డట్లే తిని వెయ్యండి. భూమి మీద ఎక్కడా కోతులు లేకుండా చేయండి. వెళ్లి రామలక్ష్మణులను పట్టుకు రండి – అంటూ అరిచాడు.

రావణుని అరుపులు విన్న అంగదుడు ముందు నవ్వుకున్నాడు. ఆనక కోపం తెచ్చుకొన్నాడు.

"ఓరి సిగ్గులేని వాడా! వంశనాశకుడా నువ్వు ఆత్మహత్య చేసుకోవడం మంచిది. నా బలం చూసైనా నీకు తెలివిరాలేదా? ఆడవాళ్లను దొంగిలించేవాడా? పాపీ, మంద బుద్ధీ, దుష్టుడా, నీకు కాలం సమీపించిందిరా! రాముణ్ణి మానవుడను కున్నావురా? నీ నాలుక తెగిపోను? నీ బ్రతుకెందుకురా? రాముడి బాణాలు నీ రక్తాన్ని త్రాగాలని ఎదురు చూస్తున్నాయి. నేను నిన్ను ఊరకనే వొదిలి వేస్తున్నాను. నేను తల్చుకుంటే నీ పళ్లు ఊడగొట్ట గలను. నీ పది తలలు విరగ్గొట్టాలని పిస్తుంది. నీ లంకను సముద్రంలో ముంచెత్తాయ్యాలనిపిస్తుంది. కాని రామాజ్ఞ లేదు కదా!" అంటూ తన ఉబలాటం ప్రకటించాడు.

రావణుడు కోపావేశంతో వాలిని ప్రశంసించి అంగదుని బలాన్ని ఎగతాళి చేశాడు.

అంగదుడికి కోపం వచ్చింది. తన బలాన్ని ప్రదర్శించాలనుకొని తన పాదాన్ని భూమ్మీద గట్టిగా బిగదీసి

ప్రతిజ్ఞ చేశాడు. "ఒరేయ్, మూర్ఖా, నువ్వు నా కాలు కదల్చగలిగితే శ్రీరాముడు వెనక్కు తిరిగిపోతాడు" అన్నాడు.

రావణుడు తన వాళ్ళతో, "ఏరులారా మీరంతా అంగదుని పాదం పట్టి లాగి వేసి, అతణ్ణి నేల మీద దొర్లించివేయండి." అంటూ అరిచాడు.

మేఘనాధుడు మొదలగు వీరులంతా సంతోషంగా లేచారు. వాళ్ళ బలమంతా కూడగట్టుకొని కాలుపట్టుకొని గుంజారు. కాని కాలు కదల్లేదు. అందరూ తల వొంచుకొని వెళ్లిపోయారు.

ఎన్ని విఘ్నాలు వచ్చినా సాధువు మనస్సు నీతి మార్గాన్ని వదలనట్లుగా అంగదుని పాదం భూమిని వదలడం లేదు.

అంగదుని ఎగతాళి సహించలేక రావణుడు స్వయంగా బయలుదేరాడు. అంగదుని పాదం కదిలించడానికి వస్తూ వున్నాడు.

అప్పుడు అంగదుడు "నా కాళ్ళు పట్టుకున్నంత మాత్రాన నువ్వు తప్పించు కోలేవు. వెళ్లి శ్రీరాముడి కాళ్లే ఎందుకు పట్టుకో గూడదు?" అని అడిగాడు.

అంగదుడి మాటలకు రావణుడు సిగ్గు పడి వెనక్కి తిరిగి పోయి సింహాసనం ఎక్కాడు.

పార్వతీ, ఏ రామచంద్రుని కనుసైగ చేత విశ్వమంతా చావు పుట్టుకలు జరుగుతూ వుంటాయో, వజ్రం గడ్డిపోచగా, గడ్డిపోచ వజ్రంగా మారు తుంటుందో అట్టి వాని దూత మాటకు తిరుగు వుంటుందా?

అటుతరువాత అంగదుడు అనేక నీతి మాటలు చెప్పాడు. రావణుడు వినలేదు. -యుద్ధ భూమిలో నిన్ను ఆటలాడించి చంపుతాను. అప్పుడు గాని నీకు నా సంగతి పూర్తిగా తెలియదు- అంటూ అంగదుడు రావణ సభా భవనం నుంచి వెళ్లిపోయాడు.

అంగదుని ప్రతిజ్ఞ విని రాక్షసవీరు లంతా భయపడిపోయారు.

అంగదుడు శత్రు బలాన్ని గజగజ లాడించి ఆనందంతో తిరిగి వెళ్లి రాముని పాదాలకు నమస్కరించాడు.

ఆ రాత్రికి రావణుడు తన మందిరానికి వెళ్లాక మండోదరి మరొకమారు శ్రీరాముని బలపరాక్రమాలను గుర్తు చేసింది. ఇప్పటికైనా తన మాటలు విని రాముడితో వైరము మానమని వేడుకొంది. కాని రావణుడు లెక్క చేయలేదు.

మరుదినం శ్రీరాముడు అంగదుని పిలిపించాడు. అంగదుడు వచ్చి రామ పాదాలకు నమస్కరించి తాను రావణ దర్బారులో ప్రదర్శించిన చాతుర్యాన్ని వివరించాడు. అంతా విని రామచంద్రుడు చాలా సంతోషించాడు.

ఆసక శ్రీరాముడు మంత్రులందరినీ పిలిపించి లంకానగరాన్ని ఆక్రమించుకొనే విధానం గురించి అడిగాడు.

అప్పుడు సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. వానరసైన్యాన్ని నాలుగు భాగాలు చేశారు. తగిన సేనాపతులను నియమించారు. సేనాపతులంతా రాముని పాదాలకు నమస్కరించి ఆశీర్వాదం పొందారు.

( ఇంకా ఉంది )

ఎంతచేసినా చివరికి మిగిలే ఋణాలు  అర్ధాంతర మరణాలు -మరెన్నో దారుణాలు - సాధారణమను కొంటున్నారా? ఇలాంటి దుష్పరిణామాలకు మీ యింటి వాస్తు దోషాలు కావచ్చు కారణం.



కాశీ నుండి కన్యాకుమారి వరకు వాస్తు పరిశోధనా పర్యటన గావించి, తన వాస్తు పాండిత్య రచనా వైశిష్ట్యం వలన "వాస్తుశాస్త్ర వాస్తవాలు" పలుపత్రికలలో ప్రచురణ కావడానికీ, గ్రంథం రూపం సంతరించుకొనడానికి కారకుడైన రచయిత - నభూతో నభవిష్యత్తుగా సూత్రీకరింప బడిన "వాస్తు సూక్తుల" నిర్మాత - ఖండాలు, అఖాతాల వాస్తు రీతులను అగాధ పరిశీలనార్థం పాఠకుల ముందుంచిన 1993 వాస్తు క్యాలెండర్ సంధాత- శ్రీ బి.నాగభూషణ రెడ్డి గారు పదవీ విరమణానంతరం తన అమూల్య వాస్తు సలహాలను అందించేందుకు ఇప్పుడు అందరికీ అందు బాటు లోనికి వచ్చారు. సమస్త వాస్తు సమస్యల పరిశీలనకు, నూతన నిర్మాణాలకు వారిని సంప్రదించండి - సఫలీకృతులు కండి.




శ్రీ బి. నాగభూషణ రెడ్డి

వాస్తు పరిశీలకులు

*5-1879, గీతాశ్రమం రోడ్,*

ప్రొద్దుటూరు - *516 360.*

కడప జిల్లా.

# వాస్తు శాస్త్రజ్ఞులూ సలహాలు జాగ్రత్తగా ఇవ్వండి

ఎ.వి. నరసింహా రావు, ఉప్పుగుండూరు.

గత రెండు నెలలుగా మన మాస పత్రికలో ప్రత్యక్ష వాస్తు, ఈశాన్య స్థలాలు వర్గీకరణ పేరుతో శ్రీ నాగభూషణ రెడ్డి గారి వ్యాసాలు ప్రచురించినారు. ఈశాన్య స్థలాలలో వున్న విభిన్న గుణాలు తెలియ పరిచి మంచి చెడులు గురించి చాల చక్కగా అభివర్ణించినారు. యిది పూర్తిగా వారి పరిశోధన ఫలితం.

ఇటువంటి వ్యాసాలు పుణ్యం వల్లనే గత మూడు నాలుగు సంవత్సరములుగా మన రాష్ట్రంలో అన్ని చోట్లా ఈశాన్య Blocksకి మంచి ధర పెరిగి అమ్ముకున్న వారు చాలా సంతోషంగా వున్నారు. అట్లాగే Plots వ్యాపారం చేసేవారు ఈశాన్య Blocksకి ప్రత్యేక ధరలు నిర్ణయించి చాలా చక్కగా లాభాలు పొందుచున్నారు. ప్రస్తుత తీరు యిట్లాగే కొనసాగితే బాగుపడేది Real Estate Owners, Plot Sellers తప్ప కొనుగోలు దారుడికి ఒరిగేదేమీలేదు. ఇది అనుభవ సత్యం.

ఇట్లా వ్రాస్తున్నది వాస్తు మీద చెడ్డ అభిప్రాయముతో కాదు. వాస్తు మీద పరిపూర్ణ నమ్మకమే ఇట్లా వ్రాయటానికి కారణమైంది.

ఈ మధ్య పలు సందర్భములలో యింటిని ఆనుకొని ఉత్తరం స్థలాలు కొని ఈశాన్య స్థలాలుగా మార్పు చెందిన వాటిని, అలాగే ప్రత్యేకించి ఈశాన్య స్థలాలు కొన్న వారు నన్ను కలవటం జరిగింది. మొత్తం మీద ఈశాన్య స్థలంగా మార్పు చేసుకున్న బుద్ధిమంతులు చెప్పింది ఒక్కటే. అదనంగా ఒరిగిందేమీ లేదు అనీ, కొన్న ధర శిరోభారమై మిగిలింది అనీ. అట్లాగే మరి కొందరు చెప్పిన దేమిటంటే ఘనమైన అప్పు స్థలరూపముగా పదిలంగా వున్నదని. దీనికంతటికి కారణం ఈశాన్యం వెర్రి. కొంటే తక్షణం లక్ష్మి పరుగున వచ్చి చేరుతుందని. ఈ పుణ్యం మొత్తం నవీన వాస్తు శాస్త్రజ్ఞులకే చెందుతుంది.

వాస్తు ఎట్టి పరిస్థితి లోనూ కొద్ది కాలంలో ఫలితం చూపదు. దీర్ఘకాలంలో దాని గుణం పూర్తిగా బయటపడుతుంది. అసలు ఈశాన్య స్థలానికి సంపద లక్షణం లేదు. వున్న దల్లా మోక్ష గుణం. ఈశాన్య స్థలాలు రాణింపు కలిగిన లక్షణం వున్న ఎడల అక్కడ వుండేవి ధర్మపీఠాలు, కళ్యాణ మండపాలు, దేవాలయములు, యజ్ఞ శాలలు, ధర్మసత్రాలు, (లాడ్జింగ్ కాదు) నేత్ర సంబంధ ఆసుపత్రులు, నివసించే గృహాలు వుంటే అక్కడ జరిగేది దీర్ఘ కాలంలో ఒక్కటే. గృహ పెద్ద వృద్ధాప్యం చెందకముందే కమండలం చేతబట్టుకొని దేశసంచారానికి వెళ్ళడం లేదా వున్న యావత్తు సంపద ధర్మ కార్యక్రమాలకు వినియోగిస్తు జీవితం చాలించటం.

ప్రస్తుత కాలగమనం సన్నిధిని దాటి దిక్కుగా పయనం జరుగు చున్నది. అనగా ఈశాన్య గుణం (దైవగుణం) నుండి ఉత్తర గుణం (ఐశ్వర్య గుణం) వైపుగా జనం

పయనిస్తున్నారు. కావున అష్టదిశల గుణం పూర్తిగా తెలుసుకున్నాకే మనిషిని బట్టి అతనియొక్క వృత్తిని బట్టి వాస్తుసలహాలు యివ్వాలి. ఇది పూర్తిగా సమయస్ఫూర్తి మీద ఆధారపడ్డ లక్షణం. వీటిని చక్కగా ఆచరించేవారే వాస్తు శాస్త్రవేత్తలు.

సనాతన వాస్తు గ్రంథములన్నియు సరియైనవే. కాలాంతరంలో గ్రంథంలో ఏర్పడిన ప్రక్షిప్తాలు అశాస్త్రమైనవి. సనాతనము అని తిరస్కరించటం శ్రేయోదాయకం కాదు. లౌకికంతో మంచిని గ్రహించాలి. వాస్తు పురుషుడు, జాతక కాలపురుషుడు ఒక్కరే. వేరుచేసి తిరస్కరించటం పండిత లక్షణం కాదు. అష్ట సిద్ధులు, నవ నిధులు కలిసే వుంటాయి. మేధస్సుతో గ్రహించాలి. వేరు చేసి మాట్లాడే శాస్త్రవేత్త వాస్తు శాస్త్రవేత్తే కాదు.

జనం క్షణిక గుణం కలవారు. ఫలితము కలగాలి అని ఎదురు చూసే వారు. కావున సలహాలకు జాగ్రత్త అవసరం.

## శ్రీమతి శిఖాకొల్లు లక్ష్మీ మోహన్‌కు డాక్టర్ అంబేద్కర్ విశిష్ట కవితా అవార్డు

విజయవాడ వాస్తవ్యులు, ప్రముఖ పారిశ్రామికవేత్తలు శ్రీ శిఖాకొల్లు మోహన్ గారి సతీమణి శ్రీమతి లక్ష్మీ మోహన్‌కు 7.1.1994వ తేదీన విజయవాడలోని తుమ్మలపల్లి వారి కళాక్షేత్రములో జరిగిన డాక్టర్ అంబేద్కర్ విశిష్ట సాహితి, సాంస్కృతిక, సేవా అవార్డుల ప్రధానోత్సవములో 'డాక్టర్ అంబేద్కర్ విశిష్టకవితా అవార్డు' ప్రదానం జరిగింది. ఈ సందర్భంగా జరిగిన సభకు కేంద్ర ప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖ మాజీ ప్రధాన కార్యదర్శులు శ్రీ కె.ఎస్.ఆర్. మూర్తి గారు అధ్యక్షత వహించారు.

## రాయలసీమకే గర్వకారణంగా ప్రొద్దుటూరులో కల్యాణ మంటప నిర్మాణ ఆరంభం

కడప జిల్లా లోని ప్రముఖ వాణిజ్య కేంద్రమైన ప్రొద్దుటూరులోని కాటన్ మర్చంట్స్ అసోసియేషన్ వారు 23.5.1993వ తేదీన "శ్రీ వాసవీ సేవా సమితి"ని ఏర్పాటు చేసుకొన్నారు. ఒక ఎకరము స్థలములో అరవై లక్షలకు పైబడిన వ్యయంతో, అన్ని రకాల ఆధునిక సౌకర్యములతో, అత్యాధునికంగా ఒక కళ్యాణ మంటపాన్ని నిర్మించడం వీరి ప్రథమ కార్యక్రమం. నిర్మాణ పనులు చురుకుగా సాగుచున్నవి. ఇప్పటికి పది లక్షలకు పై బడిన పనులు జరిగినవి కూడ. ఈ సేవాసమితికి శ్రీ వి. ఆంజనేయులు అధ్యక్షులు, శ్రీ యన్. చంద్రయ్య, శ్రీ వి. సత్యనారాయణ గారలు ఉపాధ్యక్షులు, శ్రీ కె. కేశవయ్య గారు కార్యదర్శి కాగా శ్రీ ఎ.వి. సుదర్శన రావు గారు సంయుక్త కార్యదర్శి. శ్రీ యస్.సి. పుల్లయ్య గారు కోశాధికారి.

# ప్రొద్దుటూరులో ప్రాంతీయ ఆర్యవైశ్య మహాసభలు

ప్రముఖ వాణిజ్య కేంద్రమైన కడప జిల్లా ప్రొద్దుటూరులో 12.12.1993వ తేదీన రాయలసీమ ప్రాంత ఆర్యవైశ్య మహాసభలు ఘనంగా జరిగాయి. కడప జిల్లా ఆర్యవైశ్య సంఘము వారు ఈ సభలను నిర్వహించారు. ప్రొద్దుటూరు లోని శ్రీ కొప్పరపు సుబ్బయ్య మెమోరియల్ హాలులో జరిగిన ఈ సభలకు ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ ఉపాధ్యక్షులు శ్రీ కర్నాటి వెంకట సుబ్బరాయుడు శ్రేష్ఠి గారు అధ్యక్షత వహించారు. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులు, "ప్రజాబంధు", "దానశీల" శ్రీ కామిశెట్టి సుబ్బారావు గారు ఈ సభలకు స్వాగతం పలికారు. కడప, కర్నూలు, చిత్తూరు, అనంతపురం జిల్లాల ఆర్యవైశ్య సంఘం ప్రధానకార్యదర్శులు ఈ సభలో పాల్గొని తమ తమ జిల్లా సంఘాలు చేస్తున్న, చేపట్టనున్న కార్యక్రమాలను వివరించారు. ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు సర్వశ్రీ కె.వి. రమణయ్య, ఓరుగంటి బాలకృష్ణయ్య, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ మాజీ అధ్యక్షులు శ్రీ జూటూరు వేమయ్య, నంద్యాల పురపాలక సంఘం మాజీ ఉపాధ్యక్షులు శ్రీ పెసల శ్రీనివాసులు ఈ పత్రికా సంపాదకులు "సంఘోద్ధారక", "వైశ్యభూషణ" శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి, మడకశిర పంచాయతీ అధ్యక్షులు శ్రీయస్.కృష్ణమూర్తి, వాసవీ స్రవంతి కార్యదర్శి శ్రీ కె.బి. శంకర రావు, ప్రొద్దుటూరు ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులూ, మాజీ శాసనసభ్యులూ శ్రీ కొప్పరపు సుబ్బారావు, అనంతపురం జిల్లా ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు శ్రీ డి.విశ్వనాధ గుప్త, చిత్తూరు జిల్లా ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు శ్రీ యస్.పి. మునుస్వామి శ్రేష్ఠి, కర్నూలు జిల్లా ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు శ్రీ సోమిశెట్టి వెంకటేశ్వర్లు గారలు ఈ సభల్లో పాల్గొని, ఈ సభల నిర్వహణా సంఘము వారి నుండీ జ్ఞాపికలను, సన్మానాలను అందుకొన్నారు. కడప జిల్లా ఆర్యవైశ్య సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ సురవయ్య శ్రేష్ఠి గారు వందన సమర్పణ చేశారు. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులు శ్రీ కామిశెట్టి సుబ్బారావు, ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ అంబటి కోటి గంగయ్య, వివేకానంద క్లాత్ మార్కెట్ ప్రసిడెంట్ శ్రీ తల్లం మల్లికార్జున శ్రేష్ఠి ప్రభృతులు ఈ ప్రాంతీయ సభలను విజయవంతము చేయుటలో కృషి చేశారు.

## సావనీర్ స్వీకరణ

ఆల్ ఇండియా వైశ్య ఫెడరేషన్, ఢిల్లీ వారు 1993 మే నెలలో మీరట్ పట్టణము నందు నిర్వహించిన 'వైశ్య ఏక్‌తా శతాబ్ది సమరోహ్' శతవార్షికోత్సవము సందర్భమున 'సావనీర్' (స్మారికా) ను విడుదల చేసిరి. ఇంది హిందీలో ప్రచురించబడినది. 350 పేజీలు, 1/4 క్రౌన్ సైజులో మంచి తెల్లకాగితముతో వెలువరించిరి. ముఖ చిత్రమునందు శారదాంబను భారతదేశ పటములో యిమిడ్చిరి. మంచి ఆకర్షణీయముగ నున్నది. ఇందులో భారత దేశపు రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధాని మొదలైన దేశ నాయకుల సందేశములు, ప్రముఖ వైశ్య రచయితల వ్యాసములు, వైశ్యనాయకుల ఛాయాచిత్రములు, రేఖాచిత్రములు, ప్రచురింపబడినవి. భాషారాష్ట్రములకు మూల కారకుడైన 'అమరజీవి' పొట్టి శ్రీరాములు గారి ఛాయాచిత్రముగాని, రేఖాచిత్రము గాని, ఆయనను గురించి ప్రధాన వ్యాసము గాని ప్రచురించబడియుండలేదు.

రేఖాచిత్రములలో వున్న కొంతమంది వైశ్య మహాపురుషులు అగ్రసేన మహారాజు, 'దానవీర' భామాషా, భక్తసుందరదాసు, భక్త తుకారామ్, హర్షవర్ధన చక్రవర్తి, ప్రధమ చంద్రగుప్త, సముద్రగుప్త, స్కందగుప్త కుమారగుప్త, చంద్ర గుప్త మౌర్య, చంద్ర గుప్త విక్రమాదిత్య, మైథిలీ శరణ గుప్త (హిందీకవి) డాక్టర్ విక్రమ సారాభాయ్ (అణుశాస్త్రపరిశోధకులు) మహాత్మాగాంధి, దేవదాస్ గాంధి (మహాత్మాగాంధి గారి కుమారుడు) లాలా లజపతిరాయ్ (పంజాబ్ కేసరి), ఆచార్య నరేంద్రదేవ్, రామ్ మనోహర లోహియా (సోషలిస్టు నాయకులు) బనారసీదాస్ గుప్త, మోహన్ లాల్ సుఖాడియా, చంద్రభాను గుప్త (మాజీ ముఖ్యమంత్రులు) యు.యన్. ఢేబర్ (అఖిల భారత కాంగ్రెస్ పార్టీ మాజీ అధ్యక్షులు), శ్రీప్రకాశ్ (మాజీ గవర్నర్), సీతారామ్ కేసరి (కేంద్రమంత్రి), రజనీ రంజన్ సాహు (పార్లమెంట్ మెంబరు, ఆల్ ఇండియా వైశ్య ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి) రామకృష్ణ దాల్మియా, ఘనశ్యామదాస్ బిర్లా, జమ్నాలాల్ బజాజ్, జయదయాల్ గోయంకా మొదలైన వారు.

చుండూరి అప్పారావు
రావెల, గుంటూరు జిల్లా.

## విజయవాడ పట్టణ ఆర్యవైశ్య సంఘం (కార్యాలయ ప్రారంభం)

పై ఆర్యవైశ్య సంఘం కార్యాలయ భవనాన్ని 22.12.1993న స్థానిక వైశ్య ప్రముఖులు శ్రీ బచ్చు వెంకట నరసింహారావు గారు ప్రారంభించారు. సదరు సంఘం అధ్యక్షులు శ్రీ గద్దం సుబ్బారావు గారి అధ్యక్షతన జరిగిన సభలో పలువురు వైశ్య ప్రముఖులూ, వైశ్య సోదరులూ పాల్గొన్నారు.

## ప్రాంతీయ వైశ్య విద్యానిధి వారిచే ఆర్థిక సహాయం

బళ్ళారి పట్టణం ప్రధాన కార్యస్థానంగా గల ప్రాంతీయ వైశ్య విద్యానిధి సర్వసభ్య సమావేశము 19.12.1993వ తేదీన జరిగింది. సదరు విద్యానిధి అధ్యక్షులు శ్రీ జి.వెంకటేశ్వర్లు గారు ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు. ఒక్కొక్కరికి రు.2500/-ల చొప్పున ఇంజినీరింగు చదువు విద్యార్థులు నలుగురికీ, ఒక్కొక్కరికి రు.2500/-ల చొప్పున వైద్య విద్యను అభ్యసించు విద్యార్థులు నలుగురికీ, వ్యవసాయ విద్యను అభ్యసించు విద్యార్థి ఒక్కరికి రు.1500/-లు, ఒక్కొక్కరికి రూ.1000/-ల చొప్పున, ఒక వ్యాపార విద్యను అభ్యసించు విద్యార్థికీ, డిప్లొమా చదువు విద్యార్థి ఒక్కరికీ, బి.యస్.సి., కంప్యూటర్ కోర్సు చదువు విద్యార్థులు ఇద్దరికీ వడ్డీ లేకుండా తిరిగి తీర్చుకొను పద్ధతిన ఆర్థిక సహాయాన్ని అందించేందుకు ఈ సమావేశము తీర్మానించింది. కంప్యూటర్ సైన్సు చదువు విద్యార్థులకు ఆర్థిక సహాయాన్ని అందించడము ఇదే ప్రథమము. అలా అందించాలనే తీర్మానాన్ని కూడా పై తేదీన జరిగిన సర్వసభ్య సమావేశములోనే చేశారు. వైద్య విద్యను అభ్యసిస్తున్న బెంగళూరుకు చెందిన శ్రీ యం.ఆర్. ప్రశాంత్, ఇంజినీరింగు చదువుతున్న రాజమండ్రికి చెందిన శ్రీ జె.పి.వి. సత్యనారాయణ, వ్యవసాయ విద్యను అభ్యసించిన, ప్రొద్దుటూరుకు చెందిన శ్రీ షణ్ముఖ కుమార్, కామర్సు విద్యను అభ్యసిస్తున్న హిందూపురం విద్యార్థి శ్రీ కె.పి. విష్ణు ప్రసాద్ గార్లకు తలకొక రు.500/-ల చొప్పున మెరిట్ ప్రైజులను ఇవ్వాలని కూడ ఈ సమావేశము తీర్మానించింది.

ఈ విద్యానిధి వారిచే నిర్వహింపబడుచున్న శ్రీ డి.యల్. శ్రేష్ఠి స్మారక విద్యా సహాయ నిధి నుండి తలకొక రు.250/-ల చొప్పున 28 విద్యార్థులకూ, తలకొక రు.150/-ల చొప్పున ఐదవ తరగతి నుండి ఎనిమిదవ తరగతి లోపు చదువు విద్యార్థులు 38 మందికీ కూడ మెరిట్ స్కాలర్ షిప్పుల క్రింద ఇవ్వాలని కూడ ఈ సమావేశము తీర్మానించింది.

### శ్రీ వేముల నాగభూషణం గారికి షష్టిపూర్తి

అనంతపురం జిల్లా కల్లూరు పుర ప్రముఖులు, శ్రీ వేముల నాగభూషణం గారి షష్టిపూర్తి ఉత్సవము, 6.12.1993వ తేదీన కల్లూరులోని ఆయన స్వగృహంలో వైభవంగా జరిగింది.

## దుకాణాలు - సంస్థలలోని ఉద్యోగుల సెలవు దినాలు

| | | |
|---|---|---|
| 14-01-1994 | శుక్రవారము | సంక్రాంతి |
| 26-01-1994 | బుధవారము | రిపబ్లిక్ డే |
| 14-03-1994 | సోమవారము | రంజాన్ |
| 11-04-1994 | సోమవారము | ఉగాది |
| 01-05-1994 | ఆదివారము | మే డే |
| 15-08-1994 | సోమవారము | భారత స్వాతంత్ర్య దినము |
| 02-10-1994 | ఆదివారము | గాంధీ జయంతి |
| 14-10-1994 | శుక్రవారము | విజయదశమి |
| 01-11-1994 | మంగళవారము | ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ దినము |

-ఎల్.ఆర్. నెం. డి2/ఎ.పి.యస్.హెచ్. అండ్ ఒ.హెచ్. /93
తేది : 15.12.1993, డిప్యూటీ కమీషనర్ ఆఫ్ లేబర్, కర్నూలు.

## కర్మాగారాలు - సంస్థలలోని ఉద్యోగుల సెలవు దినాలు

| | | |
|---|---|---|
| 14-01-1994 | శుక్రవారము | సంక్రాంతి |
| 26-01-1994 | బుధవారము | రిపబ్లిక్ డే |
| 14-03-1994 | సోమవారము | రంజాన్ |
| 11-04-1994 | సోమవారము | ఉగాది |
| 01-05-1994 | ఆదివారము | మే డే |
| 15-08-1994 | సోమవారము | భారత స్వాతంత్ర్య దినము |
| 02-10-1994 | ఆదివారము | గాంధీ జయంతి |
| 14-10-1994 | శుక్రవారము | విజయదశమి |

-ఆర్.సి.నెం. డి2/ఎ.పి.యస్.ఎఫ్. అండ్ ఒ.హెచ్./93
తేది : 15.12.1993, డిప్యూటీ కమీషనర్ ఆఫ్ లేబర్, కర్నూలు.




## సరిక్రొత్త గెటప్‌లో

అందమైన, ఆకర్షణీయమైన
కంప్యూటరైజ్డ్ కంపోజింగ్ &
మల్టీ కలర్ ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లో

## ప్రతి వైశ్యుని ఇంట్లో ఉండవలసిన పుస్తకాలు

- శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ (వేదోక్త) పూజా విధానము — రూ.5/-
- సంధ్యావందనము (క్రియతో కూడ) — రూ.5/-
- శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ శతోత్తర, సహస్రనామావళి — రూ.5/-
- వైశ్యులు – శాఖలు – పర్యాయ పదాలు — రూ.5/-

✦ రూ.1/- పోస్టేజి అదనం.
✦ పూర్తిసెట్ (4 పుస్తకాలు) తెప్పించుకొనే వారికి పోస్టేజి ఉచితం.
✦ పుస్తక విక్రేతలకు 25% కమీషన్ గలదు.

"వైశ్య ప్రబోధిని పబ్లికేషన్సు"
"వాసవీ భవన్"
7/512-1, జయనగర్ కాలని,
కడప – 516 002. ఫోన్ : 3025

VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

ఎదుటివారికి
నోరూరించే
అతిరుచి,
కమ్మదనమైన











గార్డన్ కాఫీ
పౌడరునే వాడండి

Phone 2201

Manufacturers
**GARDEN COFFEE WORKS**
CUDDAPAH - 516001
Prop: M. GOPALA KRISHNA

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sresl
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 3C